# శ్రీ గురూజీ
## జీవన యజ్ఞం

రచన :

శ్రీ ప్ర.గ. సహస్ర బుద్ధే

ప్రచురణ :

**సాహిత్యనికేతన్**

3-4-852, బర్కత్‌పుర, హైద్రాబాద్ -500 027

# శ్రీ గురూజీ

## జీవన యజ్ఞం

ప్రథమ ముద్రణ
క్రోధన వసంతం . ఏప్రిల్ 1985

ద్వితీయ ముద్రణ ·
వృషనామ సంవత్సరం : ఏప్రిల్ 2001

ప్రతులకు
సాహిత్యనికేతన్
3-4-852, బర్కత్‌పుర
హైదరాబాద్ - 500 027

**సాహిత్యనికేతన్**
ఏలూరు రోడ్
విజయవాడ . 520002

కంపోజింగ్ .
**జాగృతి గ్రాఫిక్స్,**
నారాయణగూడ
హైద్రాబాద్ - 29

**ముద్రణ:**
**ఆకృతి ఆఫ్‌సెట్ ప్రింటర్స్**
చిక్కడపల్లి, హైద్రాబాద్ - 20

మూల్యం : రూ. 10/-

# ప్రస్తావన

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ ద్వితీయ సరసంఘచాలక్ పరమ పూజనీయ శ్రీ మాధవ సదాశివ గోళ్‌వల్‌కర్ గురూజీ జీవిత చరిత్ర ఇది.

నేడు రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘం పని దేశమంతటా విస్తరించి ఉంది సంఘం పేరు ప్రతిష్ఠలు ప్రపంచమంతటా వ్యాపించి ఉన్నాయి. ఇదంతా ప్రధానంగా శ్రీ గురూజీ నాయకత్వం సాధించినదే. శ్రీ గురూజీ జీవితం త్యాగమయం. తపోమయం ఆయన మేధావి. ఆత్మజ్ఞాని. వ్యవహార దక్షుడు. మౌలికంగా ఆలోచించే సిద్ధాంతవేత్త, మహావక్త కఠోరమైన ఆదర్శవాదానికి సముజ్వల ప్రతిబింబం ఆయన జీవితం. అయినా ఆయన పలుకు, పనితీరు మార్దవానికీ, నమ్రతకూ ప్రతిరూపాలు. ఆధునిక యుగంలో అసాధారణ ప్రజ్ఞాశాలి అయిన మహాపురుషుడు ఆయన.

ఆ మహా దేశ సేవకుని జీవిత చరిత్రను బాలకులు, కిశోరులు, నవయువకులు చదవాలని, వారి జీవితంలోని మహత్తర ఘట్టాలను మననం చేసుకోవాలని, ఆ ఒరవడిలో తమ జీవితాలను వికసింపజేసుకోవాలని, సద్గుణాలతో సంపన్నం చేసుకోవాలని, తమ జీవన పుష్పాలను భరతమాత చరణాల ముందు అర్పించాలనే ఆకాంక్ష వారిలో మొగ్గ తొడగాలని - ఈ ఆలోచనతో శ్రీ ప్ర.గ. సహస్రబుద్ధే ఈ పుస్తకాన్ని హిందీలో రచించారు. శ్రీ కందర్ప రామచంద్రరావు దానిని తేట తెలుగులోనికి అనువదించారు.

హిందీ పుస్తకాన్ని ప్రచురించిన రాష్ట్రీయ స్వయంసేవక సంఘ ప్రకాశన్ విభాగ్ నాగపూర్ వారికి, పుస్తక రచయితకూ, అనువాదకునికీ కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం

- ప్రకాశకులు

# విషయసూచిక

# 1. పవిత్రమూర్తి

''ఆద్య సరసంఘచాలక్‌జీ ఆదేశం ప్రకారం శ్రీ మాధవరావ్‌జీ గోళ్వల్కర్ నేడు రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సర్‌సంఘచాలక్ పదవిని స్వీకరించినట్లు నేను ప్రకటిస్తున్నాను. డాక్టర్‌జీవలెనే వారిప్పుడు మనకు వందనీయులు. క్రొత్తగా నియమితులైన సరసంఘచాలక్‌జీకి నేను నా తొలి ప్రణామ్ సమర్పిస్తున్నాను.''

ఆవిధంగా ప్రకటన చేసిన తర్వాత నాగపూర్ ప్రాంత సంఘచాలక్ మాననీయ శ్రీ బాబాసాహెబ్ పాధ్యేజీ శ్రీ గురూజీకి ప్రణామ్ చేశారు. తమ స్థానానికి వెళ్ళి కూర్చున్నారు. ఆ తర్వాత శ్రీ ఆబాజీ హెడ్గేవార్ లేచి నిలబడ్డారు. ఆయన డాక్టర్‌జీ పినతండ్రి. వయోవృద్ధులు. ఆయన ఇలా అన్నారు ''మన డాక్టర్‌జీ చనిపోలేదు. మనకు చిరపరిచితులైన మాధవరావ్ గోళ్వల్కర్‌జీయే నేటినుంచి మన డాక్టర్‌జీ. వారి ఆదేశాలను డాక్టర్‌జీ ఆదేశాలుగానే భావించి మనం శ్రద్ధగా పాటించాలి.''

ఆ ప్రసంగాలు రేశిమ్‌బాగ్ సంఘస్థాన్‌లో జరుగుతున్నాయి. 1940 జులై 3న అక్కడ పెద్ద ఉత్సవం ఏర్పాటు చేశారు. వేలాది స్వయంసేవకులూ, నాగపూర్ పౌరులూ అపూర్వమైన ఆ కార్యక్రమంలో పాల్గొంటున్నారు.

వర్షాకాలం అప్పటికే ప్రారంభమైంది. ఆరోజుకూడా వాన కురిసింది. నల్లటి మబ్బులు ఆకాశాన్ని దట్టంగా ఆవరించి ఉన్నాయి. మధ్య మధ్య వాన

పడుతున్నది కూడా అయినా ఆ వాతావరణాన్ని ఏమాత్రం లెక్కచేయకుండా, గణవేష ధరించిన వేలాది స్వయంసేవకులు తమకు చిరపరిచితమైన రేశిమ్‌బాగ్ సంఘస్థాన్‌కు వచ్చి చేరారు. ఇతర నగరాలనుంచీ, ప్రాంతాలనుంచీ కూడా స్వయంసేవకులు ఈ కార్యక్రమం కోసం ప్రత్యేకంగా వచ్చారు.

రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ ఆద్య సరసంఘచాలక్ డాక్టర్ హెడ్గేవార్‌జీ 1940 జూన్ 21న స్వర్గస్థులైనారు నేడు 13వ రోజు ప్రియతముడు, పరమపూజ్యుడు అయిన తమ నాయకునికి శ్రద్ధాంజలి సమర్పించడానికి, ఆసందర్భంగా నూతన సర్‌సంఘచాలక్‌కు కార్యభారం అప్పగించడానికి ఏర్పాటుచేసిన అతిముఖ్యమైన కార్యక్రమం అది. సంఘంలోని ప్రముఖ అధికారులు దాదాపు అందరూ అక్కడ హాజరై ఉన్నారు. ప్రాంతాలవారీగా, నగ రాలవారీగా బారులు తీర్చి ఉన్నారు స్వయంసేవకులు నాగపూర్ నగర స్వయంసేవకులు శాఖలవారీగా నిలబడి ఉన్నారు. ఎదురుగా వేదిక నిరాడంబ రంగా, అందంగా ఉన్నది. వేదికమీద ప్రాంత సంఘచాలక్ శ్రీ బాబాసాహెబ్ పాధ్యే, వార్ధా జిల్లా సంఘచాలక్ శ్రీ అప్పాజీ జోషీ, శ్రీ ఆబాజీ హెడ్గేవార్, శ్రీ మాధవసదాశివ గోళ్‌వల్‌కర్, ఇతర ప్రముఖులు కూర్చొని ఉన్నారు. కుడివైపున ఎత్తైన ధ్వజస్తంభంపై పరమపవిత్ర భగవాధ్వజం గగనవీధిలో రెపరెపలాడుతున్నది. ఎదురుగా డాక్టర్‌జీ కర్మభూమి, చితా భూమి ఉన్నది. ఆ దృశ్యం చూసేసరికే భావుకులైన స్వయంసేవకుల మనస్సులలో గత స్మృతులు ఎన్నెన్నో మెదలుతున్నాయి.

స్వయంసేవకులు కాని పలువురు పురప్రముఖులు కూడా ఆఉత్సవంలో పాల్గొంటున్నారు. వారిలో కొందరికి సంఘంపట్ల ఆదరభావం ఉన్నది. మరికొందరు కేవలం కుతూహలం కొద్దీ అక్కడికి వచ్చినవారు. కారుమబ్బులు కారణంగా వాతావరణాన్ని కొంత నీరవత ఆవరించి ఉన్నది. పలువురి మనసులను కూడా అనుమాన మేఘాలు ఆవరించి ఉన్నాయి. ఇప్పుడిక సంఘం ఏమవుతుంది? సంఘ నిర్మాత, సంఘానికి సూత్రధారుడూ,

సర్వస్వమూ అయిన డాక్టర్‌జీ వెళ్ళిపోయారు. ఆయన తర్వాత ఇప్పుడీ సంఘం నడుస్తుందా? స్వయంసేవకులంతా డాక్టర్‌జీ జీవించి ఉన్నప్పుడు పనిచేసినట్లుగా ఒకే మనసుతో పనిచేయగలరా?..... ఇలాంటి రకరకాల ప్రశ్నలు పలువురి మనస్సులలో మెదలుతున్నాయి. అయితే, వారు తమ కళ్ళముందు చూస్తున్న దృశ్యం ఆ అనుమానాలను అన్నింటినీ పటాపంచలు చేస్తున్నది. ఎంత పెద్ద కార్యక్రమం ఇది! ఎంత భవ్యమైన కార్యక్రమం ! అయినా ఎంతటి అనుశాసనం! ఎంతటి ప్రశాంతత ! అన్ని ప్రశ్నలకూ సమాధానం అక్కడ సహజంగా లభిస్తున్నది. చూడు స్వయంసేవకుల నడక చూడు. ఎలా ఛాతీ విరుచుకు నడుస్తున్నారో చూడు. వారు వేస్తున్న ప్రతి అడుగులో దృఢత్వం ఉన్నది. ఆత్మవిశ్వాసమూ ఉన్నది పుష్కలంగా. ఆ కార్యక్రమం చెపుతున్నది - సంఘంలో వ్యక్తిపూజ కాక ధ్యేయనిష్ఠ నేర్పుతారని. బంధుప్రేమ, ప్రతిఫలం కోరని త్యాగం, సేవాభావం, నిరంతరం శ్రమించే లక్షణం, తపశ్చర్య - ఈ గుణ గణాలు ఆధారంగా సంఘకార్యం ఇంతవరకూ నడుస్తూ వచ్చింది. ఇకముందు కూడా ఈ గుణగణాలు ఆధారంగానే శరవేగంతో పురోగమిస్తూ ఉంటుంది. ఈ నమ్మకం ఆ వాతావరణంలో గుండె గుండెపై హత్తుకుంటున్నది.

ఆ విధంగా పాథ్యేజీ కొత్త సరసంఘచాలక్‌గారి పేరు ప్రకటించి, ఆయనకు ప్రణామ్ చేసేసరికి - నలుగడలా ఆనంద తరంగాలు వ్యాపించాయి ఇంతలో కొత్త సరసంఘచాలక్‌గారు ప్రసంగించడానికై మైక్ వద్దకు వచ్చారు. నల్లగా పొడుగ్గా ఉన్న శిరోజాలు ఆయన భుజాలమీద కదలాడుతున్నాయి. ఆ చిన్న గడ్డం ఆయన ముఖానికి కొత్తశోభ ఇస్తున్నది. ఆయన ముఖం స్ఫూర్తి ప్రదంగా భాసిస్తున్నది. ఆ ముఖంలో తేజస్సు ఉట్టిపడుతున్నది. హిమాల యాల నుంచి అప్పుడే వచ్చిన యువ తాపసి అక్కడ నిలచినట్లు అనిపించింది. ఆయన విగ్రహం చూడగానే స్వయంసేవకుల మనసులు వికసించాయి. ఒడలు పులకరించాయి. ఎంతో శ్రద్ధగా అంతా ఆయన ప్రసంగాన్ని వినసాగారు.

# 2. నేనో పశువుల కాపరిని

సరసంఘచాలక్‌గా శ్రీ గురుజీ చేసిన తొలి ప్రసంగం అది. ఆ ప్రసంగం సూటిగా తేటగా ఉంది అందులో ఆకర్షణ ఉంది అద్భుతమైన ప్రభావం వుంది ప్రసంగ సారాంశం ఇలా వుంది.

''మీ ఎదుట ఏదైనా మాట్లాడగలుగుతానా లేదా అని నాకిప్పుడు అనిపిస్తోంది. ఎందుకంటే, నా మనస్సు దుఃఖంతో నిండి ఉంది. ఈ దుఃఖ సమయంలోనే నా మీద ఒక గొప్ప బాధ్యత వచ్చిపడింది. డాక్టర్‌జీ ఇక లేరు అనే ఊహనే మనం భరించలేము కానీ, మన పని కేవలం కోమల భావనలపై ఆధారపడినది కాదు. ఆలోచనలపై, సిద్ధాంతాలపై ఆధారపడినది. వాస్తవికతను పూర్తిగా గుర్తించి నడచే పని మనది.

''మన డాక్టర్‌జీ మహాద్రష్ట. త్యాగమూర్తి. నిరంతరం శ్రమించిన వ్యక్తి. ఆయన తన జీవితం ద్వారా మనముందు ఒక మహత్తరమైన ఆదర్శాన్ని నిలిపి ఉంచారు తల్లి చూపే వాత్సల్యం, తండ్రి చూపే సామర్థ్యం, ఉపాధ్యాయుడు చూపే నైపుణ్యం - ఈ మూడూ మనకు ఆయనలో లభించేవి. ఆయన నా ఆరాధ్యదైవం. ఆయనను పూజించడం నాకు జీవితంలో అన్నిటికన్నా ఆనందాన్ని ఇచ్చిన అంశం. ఆయనను పూజించడంలో ఎవరికీ ఎన్నడూ వ్యక్తిపూజ దోషం అంటదు. ఎందుకంటే ఆయనకు అసలు వ్యక్తిగత జీవితం అన్నది లేనేలేదు. ఆయన జీవితమంతా మహోన్నతమైన సిద్ధాంతాలతో నిండి ఉంది ఆయన జీవనం త్యాగమయం, సేవామయం, సమర్పితం.

ఆయనను పూజించేటప్పుడు మనం ''శివో భూత్వా శివం యజేత్'' అనే సూక్తిని పాటించాలి. శివునిగా రూపొంది శివుణ్ణి పూజించు - అని అర్థం ఆ సూక్తికి. కనుక - మనం డాక్టర్‌జీని పూజించాలంటే ఆయనలా తయారు కావాలి. స్వదేశాన్ని గురించి ఆయన ఆలోచన ఎంత తీవ్రంగా ఉండేదో. దేశ

అభ్యున్నతి కోసం ఆయన ఆత్మ ఎంతగా తపించిపోయేదో. ఆయన చేపట్టిన ఆ వ్రతాన్ని మనం కూడా పాటించాలి.

''తన బలిదానంతో ఆకాశం అంతటినీ తేజస్సుతో నింపడం గొప్ప విషయమే అందులో సందేహం లేదు అలాంటి వ్యక్తులను అమరవీరులని పిలుస్తారు

అయితే, ఎప్పుడూ జ్వలిస్తూ భస్మం అవుతూ వుండడం, మంచి గంధపు చెక్కలా జ్వలిస్తూ, తన జీవితాన్ని ముగించడం అంతకన్నా పెద్ద విషయం దాని గొప్పతనం వేరు. ఎల్లప్పుడూ నిలచే గొప్పతనం అది. ఎంతో అవసరమైన గొప్పతనం అది. డాక్టర్‌జీ మనకు ఈ పాఠం నేర్పారు సంఘం పని ప్రారంభమైనప్పుడు ఇలా ఆలోచించిన వ్యక్తి డాక్టర్‌జీ ఒక్కరే నేడు మనం వేలాది స్వయంసేవకులం ఆ భావనలో మునిగి తేలుతున్నాం. ఆ పనిని తను మన ధన పూర్వకంగా చేస్తామని ప్రతిజ్ఞ చేశాం. మనవంటి ఎన్నెన్నో హృదయాలను వెలిగించడం అనే అసామాన్యమైన కార్యాన్ని డాక్టర్‌జీ చేసి చూపారు.

''డాక్టర్‌జీకి అసామాన్యమైన సామర్థ్యం ఉంది. నా వంటి అతి సామాన్యమైన వ్యక్తిపైన ఇంతటి పెద్ద కార్యభారాన్ని మోపడం అందుకో ఉదాహరణ. ఇది చూచినప్పుడు నాకు శ్రీ రామకృష్ణ పరమహంస శిష్యుడు ఒకరు గుర్తుకు వస్తారు. అందరూ అతనిని మొద్దబ్బాయి అనుకునేవారు. ఆరునెలలు కష్టపడినా అతనికి అక్షరాలు అయినా రాలేదంటారు అయితే, అతడు శ్రీ రామకృష్ణుని పూజా ద్రవ్యాలన్నీ ఎంతో శ్రద్ధగా సమకూర్చేవాడు. పూజకోసం బోలెడు పూలు కోసి తెచ్చేవాడు. శ్రీ రామకృష్ణ దేవుడు తన ఇహలోక లీల చాలించే సమయంలో అతని తలపై చేయి ఉంచి అతనిని ఆశీర్వదించారు. కొద్ది రోజులలోనే ఆ శిష్యుడు పండితుడు అయినాడు. ఉపనిషత్తులకు చక్కని భాష్యం చెప్పసాగారు. మహాపురుషులు తమ స్పర్శ ద్వారా, ఆశీస్సుద్వారా ఏ వ్యక్తికి అయినా గొప్ప సామర్థ్యాన్ని ప్రసాదించగలరు.

''మరో ప్రాచీన కథ కూడా నాకు గుర్తుకు వస్తోంది. అవంతి నగరం సమీపాన సామ్రాట్ విక్రమాదిత్యుని సింహాసనం భూమిలో కూరుకు పోయింది. అక్కడ ఒక మట్టి దిబ్బ ఏర్పడింది అక్కడ పశువుల కాపరులు ఆవులను తోలుతూ ఉంటారు వారిలో హెచ్చుమంది చిన్నవాళ్ళు. వారి మధ్య ఎప్పుడైనా తగాదా వస్తే, ఒక పిల్లవాడు ఠక్కున ఆ దిబ్బమీదకి వెళ్లి కూర్చుంటాడు. అక్షరాలా న్యాయం చెపుతాడు విక్రమాదిత్యుడు చేసిన పుణ్యం ఫలితంగా ఆ పశువుల కాపరికి అలౌకికమైన శక్తి అబ్బేది. ఈ సర సంఘచాలక్ పదవి కూడా విక్రమాదిత్యుని సింహాసనమే. నేను ఒక పశువుల కాపరిని మాత్రమే డాక్టర్‌జీ నాకు సరైన ప్రేరణ ఇస్తారు. నా చేత ఏది సముచితమో అదే చేయిస్తారు ఆ విషయంలో మీరు నిశ్చింతగా వుండవచ్చు

''నిష్ఠతో, నిశ్చయంతో సంఘ కార్యాన్ని పెంచడం మన బాధ్యత. మన సంఘం తాకితే ముడుచుకుపోయే సోకుడు ముడుగు కాదు. ప్రపంచం అంతటా వివిధ సిద్ధాంతాలూ, వాదాలు మిడిసిపడుతూ ఉండవచ్చు. ఆ ఘర్షణలో మన పని నశించిపోదు ఇది కష్టాల మంటలలో మాడిపోదు. ఎవరు అణచినా అణగదు. ఇది అభేద్యమైన దుర్గం. దీనిని ముట్టడించే వ్యక్తి తన తల పగలగొట్టుకుంటాడు. డాక్టర్‌జీ చూపిన బాటలో మనం ముందుకు సాగిపోదాం. ఇందులో మనకు రెండు ప్రయోజనాలు కలుగుతాయి. మన వ్యక్తిగత జీవితం సఫలం అవుతుంది. రాష్ట్ర కళ్యాణం జరుగుతుంది. మన సంఘకార్యం ద్వారానే హిందూరాష్ట్రం వైభవం పొందుతుంది. మన హృదయాలలోని ధ్యేయమనే జ్యోతి అఖండంగా వెలుగుతూ నిలిచి ఉన్నప్పుడే ఇదంతా సాధ్యపడుతుంది. అంతేకాదు, మనం ఆ జ్యోతిని మరింతగా వెలుగులీనేలా చేయాలి. మనం ఎలాంటి వికారాలకూ లోనుకాకూడదు. ఎలాంటి వ్యామోహాలకూ గురికాకూడదు. మనం ఎప్పుడూ అడుగు ముందుకే వేయాలి. మన స్వయంసేవకులూ, మిత్రులూ అందరి సహకారంతో ఈ పనిని సక్రమంగా నిర్వహించగలననే నమ్మకం నాకు ఉన్నది.''

శ్రీ గురూజీ చేసిన ఆ ప్రసంగం వింటూ శ్రోతలు మంత్రముగ్ధులు అయినారు వారి హృదయాలలో అమృతం కురిసింది. వారి మనసులలో దుఃఖం పటాపంచలైంది. అనుమానాలన్నీ అంతమయినాయి. చీకట్లు తొలగి వెలుగు రేఖలు విచ్చుకున్నాయి.

కార్యక్రమం పూర్తయింది స్వయంసేవకులూ, పురప్రముఖులూ ఇళ్ళకు తిరిగి వెళుతున్నారు. వారిలో పలువురి నోట ఇలాంటి వ్యాఖ్యలు వినవచ్చాయి.

''డాక్టర్‌జీకి మనుషులకు విలువకట్టడం తెలుసు. ఆయన ఎంత విలువైన నరరత్నాన్ని ఎంచుకున్నారో చూశారా!''

''ప్రసంగం ఎంతటి ప్రభావం కలిగించిందో! ప్రతి మాటలో ఆత్మవిశ్వాసం మెరుస్తోంది. అయినా ఎంతటి నమ్రత!''

''డాక్టర్‌జీయే యువ రూపంలో ప్రత్యక్షం అయినారని నాకు అనిపించింది''

''ఆయన ఎన్నుకున్న ఒక్కొక్క మాటా ఎద లోతులను ఎలా కదిలించిందో!''

''ఆయన చూపిన ఉదాహరణలు చక్కగా అతికినట్లు ఉన్నాయి. చెప్పదలచిన అంశాన్ని స్పష్టం చేసేవిగా ఉన్నాయి.''

''ఆయన పేరుకు మాత్రమే గురూజీ కాదు. రాష్ట్ర గురువు, జగద్గురువు కాదగిన లక్షణం ఆయనలో ఉన్నది. అయినా - నేను కేవలం ఒక పశువుల కాపరినే అంటారు ఆయన.''

ఆయన ఎవరు? ఎక్కడి వారు?

# 3. వంశ పరిచయం

బొంబాయికి దక్షిణాన సహ్యాద్రికీ, సముద్రానికీ మధ్య గల భూభాగాన్ని కొంకణ ప్రాంతం అంటారు. కొంకణంలో గోల్‌వలీ అనే గ్రామం ఉన్నది. ఆ గ్రామంలో ఒక బ్రాహ్మణ కుటుంబం ఉన్నది. వారి ఇంటి పేరు పాధ్యే. ఆ

కుటుంబం విద్వత్తుకూ, సత్ ప్రవర్తనకీ పెట్టింది పేరు. ఆ కుటుంబానికి చెందిన ఒక శాఖ శ్రీక్షేత్రం పండరిపూర్ వెళ్ళి అక్కడ స్థిరపడింది. ''ధర్మసింధు'' అనే గ్రంథం వ్రాసిన బాబాపాధ్యే జన్మించింది ఆ శాఖలోనే. ఈ కుటుంబంలోని ఒక ఉపశాఖ పైఠణ్ వెళ్ళింది అక్కడ ఆ శాఖవారు గోళ్‌వల్‌కర్ అని ఇంటిపేరు పెట్టుకున్నారు వారిలో కొందరు నాగపూర్, రాయపూర్‌లలో స్థిరపడ్డారు.

గురూజీ తాతగారిపేరు బాలకృష్ణ. ఆయన అకస్మాత్తుగా చనిపోయారు. అందువల్ల ఆయన కుమారుడు, అంటే శ్రీగురూజీ తండ్రిగారు చిన్న వయసులోనే ఉద్యోగం చేయవలసి వచ్చింది. చదువు మధ్యలో ఆగిపోయింది. ఆయనకు పోస్టాఫీసులో ఉద్యోగం దొరికింది. కుటుంబాన్ని పోషించడానికి ఉద్యోగం చేయడం అవసరం అయింది. కానీ, ఆయనకు సహజంగా చదువుకోవడంలో, చదువు చెప్పడంలో అభిరుచి ఉంది. ఉత్తరాలమీద నల్లటి తపాలా ముద్ర వేయడంలోకన్నా పిల్లల మనసులపై చక్కటి సంస్కారాలు ముద్రించే పనిలో ఆయనకు ఆసక్తి హెచ్చు. అందువల్ల ఆయన విద్యాశాఖలో ఉద్యోగం కోసం వెదకారు. ఆయన విద్యాశాఖ అధికారి వద్దకు వెళ్ళారు. ఆ అధికారి ఇలా అన్నాడు. ''చూడు బాబూ! ప్రతివాడూ పట్టణంలోనే ఉద్యోగం కావాలంటాడు. పల్లెటూరికి వెళ్ళడానికి సిద్ధపడితే నీకు వెంటనే ఉద్యోగం దొరకగలదు. రాయపూర్ జిల్లాలోని సరాయపాలీ గ్రామానికి వెళ్ళడానికి ఇష్టపడితే, నీకు ఇప్పటికిప్పుడే ఉత్తర్వు జారీ చేయించగలను''

సదాశివరావు ఇలా అన్నారు : ''అది నేను కోరుకున్నదే అవుతుంది. పోస్టాఫీసులో తపాలా ముద్రలు వేస్తూ కూర్చొనడం నాకు ఎంతమాత్రం రుచించదు. చదువుకోవడం అన్నా, చదువు చెప్పడం అన్నా నాకు ఎంతో ఇష్టం. ప్రాచీన కాలంలో ఋషులు, మునుల ఆశ్రమాలు అరణ్యాలలోనే ఉండేవి. మీరు నన్ను గ్రామానికే కదా పంపుతున్నారు. నేను సంతోషంగా అక్కడికి వెళతాను. ఉపాధ్యాయుడిగా పని చేస్తాను.''

ఇప్పుడు ఉండే ప్రయాణ సౌకర్యాలు ఆ రోజుల్లోలేవు. సరాయపాలీ గ్రామం రైలు మార్గానికి 60 మైళ్ళ దూరంలో ఉంది. సదాశివరావు కాలి నడకన అక్కడికి వెళ్ళవలసి వచ్చింది. అయినా ఆయన ఉత్సాహంగా సరాయపాలీ చేరారు. ఉపాధ్యాయుడిగా తన బాధ్యతను నిర్వహించారు. ఆయన చదువు చెప్పేవారు చదువుకునేవారు కూడా. క్రీ.శ. 1893లో ఆయన మెట్రిక్ ప్యాసయినారు. 1903లో ఇంటర్, 1910లో బి.ఏ. ప్యాసయినారు.

ఆ రోజుల్లో చిన్నతనంలోనే పెళ్ళిళ్ళు జరిగేవి. 15 సంవత్సరాల వయస్సులోనే సదాశివరావుకు పెళ్ళయింది. ఆయన భార్య పేరు లక్ష్మి. నాగపూర్‌లోని రాయకర్ కుటుంబానికి చెందిన కన్య ఆమె. లక్ష్మీదేవి గృహలక్ష్మి అయింది. ఆమె గుణలక్ష్మి కూడా. ఆమె అక్షరాలా సహధర్మచారిణి. ఒక కర్మయోగినివలె ఆమె సదాశివరావుతో కలిసి కష్టాలను ధైర్యంగా ఎదిరించింది. చక్కని పద్ధతులలో ఇంటిని తీర్చిదిద్దుకునేది. ఆపదలు ఆమెను ఎన్నడూ క్రుంగదీయలేదు.

సదాశివరావును అంతా భావుజీ అని పిలిచేవారు. లక్ష్మీబాయిని తాయీ అని పిలిచేవారు. ఇద్దరి స్వభావాలూ వేరు. అయినా వారి దాంపత్య జీవితం పరస్పర పూరకంగా, పోషకంగా ఉండేది. భావుజీది జ్ఞానమార్గం. తాయీది భక్తిమార్గం. భావుజీకి అనుశాసనం ముఖ్యం. ఆయన కర్తవ్యదక్షుడు. ఆయనలో కొంత కఠోరత ఉండేది. తాయీ స్నేహశీల. మృదు స్వభావం కలది. భావుజీ మితభాషి. తాయీకి మాట్లాడడం, మాటలు వినడం ఇష్టం. బావుజీకి ఒంటరితనం ఇష్టం. తాయీ అందరితో కలుపుగోలుగా ఉండేది.

1929లో భావుజీ ఉద్యోగ విరమణ చేశారు. నాగపూర్ జిల్లాలోని రామ్‌టేక్‌లో ఇల్లు కొని, అక్కడే స్థిరపడ్డారు.

1942లో ఆయన నాగపూర్ వచ్చారు. చితార ఓలీ అనే వీధిలో అద్దె ఇంటిలో ఉంటూ వచ్చారు. 1954లో భావుజీ తనువు చాలించారు. తాయీ 1962లో స్వర్గస్థురాలు అయింది.

# 4. ఆదర్శ ఉపాధ్యాయుడు

సదాశివరావు దృష్టిలో పాఠశాలలో చదువు చెప్పడం వట్టి నౌకరీ కాదు అది కేవలం డబ్బు సంపాదించే సాధనం కాదు. తన మనసుకు నచ్చిన పని అది. చదువు చెప్పడంలో ఆనందం అనుభవించేవారు ఆయన. వారి ఇంటివద్ద విద్యార్థులు గుంపులు గుంపులుగా ఉండేవారు. సదాశివరావు అందరికీ ఉచితంగా చదువు చెప్పేవారు. చదువు చెప్పడం ఆయన దృష్టిలో జ్ఞానదాన యజ్ఞం.

విద్యార్థులంటే ఆయనకు ప్రాణం. విద్యార్థులకు ఆయన అంటే ప్రాణం విద్యార్థులు దేవతా స్వరూపులని భావించేవారు ఆయన. విద్యార్థులు తప్ప మరే విషయమూ ఆయన అంతగా పట్టించుకునేవారు కాదు. ఆయన భయం అనేది ఎరుగరు. ముక్కుసూటిగా మాట్లాడేవారు. స్తోత్రపాఠాలు వల్లించడం ఆయనకు తెలియదు. ఆయన ఎవ్వరినుంచీ అక్రమంగా ప్రయోజనం పొందరు. అందువల్ల ఎప్పుడూ ఎవరికీ ముఖస్తుతులు చేయరు.

ఆయన పై అధికారులలో ఒకరికి ఇతరుల వస్తువులను కాజేయడం అలవాటు. ఆ పెద్దమనిషి ఎప్పుడూ చెప్పులుకాని, గొడుగుగాని, అలాంటి ఇతర వస్తువులు కాని కొని ఎరుగడు. ఒకసారి ఒకరి ఇంటిలో తేనీటి విందు జరిగింది. ఆ విందుకు పిలిచిన వారిలో ఈ పెద్దమనిషి కూడా ఉన్నారు. ఆయన విందునుంచి తిరిగి వెళుతూ తళతళ మెరుస్తూన్న కొత్త చెప్పులు తొడుక్కుని బయలుదేరినాడు. పలువురు అది గమనించారు. కానీ ఆయన పెద్ద అధికారి. ఆయనను ఎవరు మందలించగలరు? అంతా భయపడి, చూసీ చూడనట్లు ఊరుకున్నారు. సదాశివరావు మాత్రం ఉండబట్టలేకపోయారు. ఆయన లేచారు. ఠక్కున ఆ అధికారి దగ్గరకు వెళ్ళి ''అయ్యా, మీ చెప్పులు అదిగో అక్కడ ఉన్నాయి. ఇవి మీవికావు'' అన్నారు. అప్పుడు ఆ అధికారి కొత్త చెప్పులు విడిచిపెట్టి, తన చెప్పులు తొడుక్కుని, ''అప్పుడప్పుడు పొరపాటు జరుగుతూ వుంటుంది'' అని గొణుగుతూ వెళ్ళబోయాడు. అప్పుడు సదాశివరావు

ఆయన చేతిలోనించి తన కొత్త గొడుగు తీసుకొని, అక్కడే ఉన్న ఆయనగారి చిరిగిన పాత గొడుగును ఆయన చేతిలో పెట్టారు.

సదాశివరావు తరహాయే అంత. చదువు చెప్పడంలో ఆయనను మించిన వారు లేరు అందువల్ల ఆయన ఎప్పుడూ ఎవరికీ వంగి సలాములు చేయరు. అయితే అందుకు ఫలితం అనుభవించవలసి వచ్చింది కూడా. ఆయనకు బదిలీలమీద బదిలీలు జరిగాయి. దుర్గ్, రాయపూర్, చాందా, భండారా, బాలాఘాట్, నరసింహపూర్, హోశంగాబాద్ వంటి స్థలాలకు ఆయన వెళ్ళవలసి వచ్చింది. కానీ ఎక్కడికి బదిలీ చేసినా ఆయన అభ్యంతరం చెప్పలేదు. ఎక్కడైనాసరే, విద్యార్థులకు చదువు చెప్పవలసిందేకదా. చదువు చెప్పడం ఆయన చేసే పుణ్యకార్యం. అది ఆయన వ్రతం. ఆయన ధర్మం. తాయీ ఉపవాసాలు పూజలు, అర్చనలలో మునిగి వుండేది. ఆమె ఆ మార్గంలో పుణ్యం సంపాదించేది. ఇద్దరూ కలిసి ఎంతో ఆనందంగా గృహస్థ జీవితం గడుపుతూ వుండేవారు.

కానీ, ఈ జగత్తు ఎంతో విచిత్రమైనది. సుఖాన్ని అంటిపెట్టుకునే ఉంటుంది దుఃఖం సంతానం విషయంలో భావుజీ, తాయీలు పుట్టెడు దుఃఖం అనుభవించవలసి వచ్చింది. వారికి తొమ్మిదిమంది పిల్లలు పుట్టారు. వారిలో ఏడుగురు చిన్నప్పుడే చనిపోయారు. మూడవవాడు అమృత్. అతను పెద్దవాడు అయ్యాడు కానీ, పదిహేను సంవత్సరాల వయస్సులోనే యముడు అతనిని ఎత్తుకుపోయాడు. మాధవ్ నాల్గవవాడు. అతను ఒక్కడే మిగిలాడు. ఆయన ఎక్కువ కాలం జీవించారు. ఎంతో కీర్తి గడించారు కూడా. ''ఏకః చంద్రః తమో హన్తినచ తారాగణానిచ'' ఒక్క చందమామ చీకటిని తొలగిస్తాడు, నక్షత్రాలు ఎన్ని ఉన్నా ఆ పని జరగదు. ఈ సుభాషితాన్ని ఆయన సార్థకం చేశారు. ''వంశలతా వహ అమర హుయీ, దేశ హితార్థ జో నిర్వంశ భయీ'' అనే సావర్కర్ సూక్తిని మాధవ్ తన జీవితం ద్వారా ప్రపంచానికి బోధించారు. తండ్రిగారు పాఠశాలలో పిల్లలకు పాఠాలు చెప్పారు. మాధవ్ భారతదేశం అంతటా ఆబాలగోపాలానికి పాఠాలు చెప్పారు.

# 5. సవాయీ మాధవరావు

మాఘ బహుళ ఏకాదశిని విజయ ఏకాదశి అంటారు. శాలివాహన శకం 1827లో ఆ విజయ ఏకాదశి పర్వదినాన మాధవ్ జన్మించాడు. ఇంగ్లీషు తారీకు ప్రకారం ఆరోజు 1906 ఫిబ్రవరి 19. నాగపూర్‌లో తన మేనమామ ఆబాజీ రాయకర్ గృహంలో అతను జన్మించాడు. పిల్లవాడు తెల్లగా వున్నాడు. కొనతేలిన ముక్కు. తేజస్సు నిండిన కళ్ళు. మాధవ క్రమంగా పెరిగి పెద్దవాడు అవుతున్నాడు. తన బాల్యక్రీడలతో అందరినీ ముగ్ధులను చేస్తున్నాడు. అతడు జన్మించడంతో రాయకర్ కుటుంబానికి దశ ఎత్తుకుంది. అది అతడు పుట్టిన వేళా విశేషమనీ, అతడు శుభ లక్షణాలు కలిగినవాడనీ అంతా అనుకున్నారు. ఆ తర్వాతనే సదాశివరావు ఉద్యోగం స్థిరపడింది. ఆయనకు ప్రమోషన్ వచ్చింది. పిల్లవాడికి మాధవ్ అని పేరుపెట్టారు. అంతా ముద్దుగా మధు అని పిలచేవారు. సదాశివరావు మాత్రం అతడిని సవాయీ మాధవరావు అని పిలచేవారు. తన కుమారుడు ముందు ముందు గొప్పవ్యక్తి అవుతాడని ఆయన నమ్మకం.

మాధవ్ కుశాగ్రబుద్ధి. పువ్వుపుట్టగానే పరిమళిస్తుంది. శిశువుగా ఉన్న దశలోనే అతడి బుద్ధి అసామాన్యమైనదని రూఢి అయింది. భావుజీ పూజకు కూర్చునేటప్పుడు మాధవ్ ఆయన ప్రక్కనే కూర్చునే వాడు. అలా వినీ వినీ, అతడు ఎన్నో శ్లోకాలూ, స్తోత్రాలూ కంఠస్థం చేశాడు. రామరక్షాస్తోత్రం, మహిమ్నస్తోత్రం వంటి స్తోత్రాలను ఎవరూ అతడిచేత వల్లె వేయించలేదు. అతడు విని వాటిని గుర్తు పెట్టుకున్నాడు. సదాశివరావు వద్దకు విద్యార్థులు ఎప్పుడూ వస్తూనే వుండేవారు. వారికి చెప్పే పాఠాలను మాధవ్ వినేవాడు. ఆ వెంటనే అప్పజెప్పేవాడు. అన్నయ్య అమృత్ చదువుకునేటప్పుడు మాధవ్ శ్రద్ధగా వినేవాడు. ఆ తరువాత ఏ ఒక్కమాటా పొల్లుపోకుండా విన్నపాఠాలన్నీ వినిపించేవాడు. అలా ఇంగ్లీషులో, మరాఠీలో, హిందీలో చక్కని పాఠాలు ఎన్నెన్నో అతడికి కంఠస్థం అయినాయి.

ఒకసారి అమృత్ వక్తృత్వ పోటీకి పేరు ఇచ్చాడు. ఉపాధ్యాయుడు అతనిచేత ఉపన్యాసం వ్రాయించాడు. అతడు ఇంటివద్ద దానిని మళ్ళీమళ్ళీ చదువుతూ వుండేవాడు. అది మాధవ్ చెవిలో పడుతూ ఉండేది. అలా మాధవ్‌కు కంఠస్థం అయిపోయింది. పోటీకి ముందురోజున అమృత్‌కు తీవ్రంగా జ్వరం వచ్చింది పోటీలో పాల్గొనడం అతనికి అసాధ్యం అయింది. పాఠశాల తరఫున పోటీలో ఎవరూ పాల్గొనలేకపోతున్నందుకు ఉపాధ్యాయుడు బాధపడ్డాడు

అప్పుడు మాధవ్ ఆయన వద్దకు వెళ్ళాడు. ''అమృత్ అన్నయ్యకు బదులు నన్ను పోటీకి పంపరా?'' అని అడిగాడు.

''నీవు అసలు ఉపన్యాసం చదవనైనా లేదు. నీవు ఎలా మాట్లాడగలవు? ముందు దానిని వల్లె వేయాలికదా?'' అని ఉపాధ్యాయుడు సమాధానం చెప్పాడు.

''చూడండి. నేను ఈ విధంగా మాట్లాడతాను'' అంటూ మాధవ్ ఉపాధ్యాయునికి ఉపన్యాసం మొత్తం వినిపించాడు. ఎక్కడా ఆగలేదు. ఎక్కడా తడబడలేదు. ఒకచోట గొంతు తగ్గించారు. ఒకచోట ఎంతో ఆవేశంతో మాట్లాడాడు. అలా చక్కని శైలిలో ఉపన్యాసం వినిపించాడు. ఉపాధ్యాయుని ఆనందానికి అవధులు లేకపోయాయి. ఆయన మాధవ్‌ను పోటీకి పంపారు. పోటీలో మాధవ్ మొదటి బహుమతి గెలుచుకున్నాడు.

క్రీ.శ. 1917లో మరో సంఘటన జరిగింది. వైనగంగానది ఒడ్డున బ్రహ్మాండమైన విద్యార్థి సమ్మేళనం జరిగింది. అక్కడ రకరకాల పోటీలు నిర్వహించారు. వక్తృత్వపోటీలో మాధవ్ మొదటి బహుమతి గెలుచుకున్నాడు. ముగింపు ఉత్సవానికి బారిస్టర్ ములానా అధ్యక్షత వహించారు. ఆయన మాధవ్ ఉపన్యాసాన్ని ఎంతగానో మెచ్చుకున్నారు. మాధవ్ కలసినప్పుడల్లా అతనిచేత ఒకటి రెండు పేరాలు చదివించి, విని ఆనందించేవారు.

# 6. తల్లిదిద్దిన సంస్కారం

సాయం సమయం. పాఠశాల వదలిపెట్టారు. మాధవ్ ఇంటికి తిరిగి వస్తున్నాడు. త్రోవలో అతనికి ఒక పిల్లవాడు కనపడ్డాడు. అతడు మట్టిలో

కూర్చుని ఏడుస్తున్నాడు. అతని పుస్తకాలు చిందరవందరగా పడి ఉన్నాయి. అతని కాలికి దెబ్బ తగిలింది. రక్తం కారుతోంది. మాధవ్ అతని దగ్గరికి వెళ్ళాడు పుస్తకాలు పోగుచేసి అతని సంచిలో సర్దాడు. కన్నీళ్ళు తుడిచాడు. తన చేయి ఊతం ఇచ్చి అతనిని లేవదీశాడు. తన ఇంటికి తీసుకు వెళ్ళాడు. ఇంటిలో తాయీ ఉన్నది. తాయీ ఆ పిల్లవాడి గాయం కడిగి మందువేసి కట్టుకట్టింది. మిఠాయి పెట్టింది. ఆ పిల్లవాడు నవ్వుముఖంతో ఇంటికి వెళ్ళిపోయాడు.

అప్పుడు తాయీ అడిగింది. ''మధూ, నీ స్నేహితుడి పేరు ఏమిటి? అతనిది మీ తరగతేనా?''

''అతడు నా స్నేహితుడు కాడు. నా తరగతి వాడూ కాడు. పాపం రోడ్డుమీద కూర్చుని ఏడుస్తున్నాడు అందుకని అతనిని మన ఇంటికి తీసుకువచ్చాను'' అని మాధవ్ సమాధానం చెప్పాడు.

''సెభాష్ మధూ! నీవు చాలా మంచిపని చేశావు. కష్టాలలో, బాధలలో ఉన్న వారికి పరుగు పరుగున వెళ్ళి సాయపడటం మనిషి కర్తవ్యం'' అంటూ వెన్నుతట్టింది తాయీ.

మాధవ్ పరోపకారి. గొప్ప భావుకుడు. పుస్తకాలు చదవడం అంటే అతనికి మహాసరదా. హిందీ, మరాఠీ, ఇంగ్లీషు నవలలు ఎప్పుడూ చదువుతూ ఆయా నవలలలోని పాత్రలలో లీనమైపోయేవాడు. ఒక నవలలో కష్టాలలో మునిగి ఉన్న గుణవంతుడైన ఒక బాలుని కథ ఉంది. ఆ కథ చదువుతూ చదువుతూ మాధవ్ ఏడుస్తున్నాడు తాయీ కొంచెం కంగారు పడింది. ఉన్నట్టుండి మాధవ్‌కు ఏమయింది? దగ్గరకు వెళ్ళి, ఏమి జరిగిందని అడిగింది. మాధవ్ దయనీయమైన ఆ బాలుని కథ వినిపించాడు.

''పాపం అతను ఎలాంటి క్లిష్ట పరిస్థితిలో చిక్కుకున్నాడో చూడు. అతను అందులోనుంచి బయటపడతాడంటావా? అని అడిగాడు.

''బాధపడకు. అతను తప్పకుండా బయటపడతాడు. మంచివాళ్ళను దేవుడు రక్షిస్తాడు.''అని తాయీ నమ్మకంగా చెప్పింది.

అమ్మ అలా నమ్మకం కలిగించేసరికి మాధవ్ ఎంతో తృప్తిపడ్డాడు. అతని మనసు కుదుటపడింది.

తాయీ తన మాటలతో, చేతలతో మాధవుని పసి మనసు మీద చక్కని సంస్కారాలు ముద్రిస్తూ వుండేది.

అలాగే, ఒకసారి మాధవ్ ఇంటి ఆవరణలో మేకులు కొడుతున్నాడు. అది చూసి తాయీ ఇలా అన్నది : ''మాధవ్, బుద్ధిమంతులు ఈ పని ఎప్పుడూ చేయరు. ఇది మన భూమాత. భూమాత ఒంటిలో మేకులు దించి ఆమెకు బాధ కలిగించడం మంచిపని కాదు.''

''భూమాత'' అనే మాట మాధవ్ మనసులో శాశ్వతంగా నిలచి పోయింది.

# 7. వజ్ర నిశ్చయం

మాధవ్ పట్టుదల మహాగట్టిది. ఏదైనా ఒక విషయం మనసులో పడితే, ఇతర విషయాలన్నీ వదలివేసి దానివెంట పడతాడు. అప్పుడు అతని వయస్సు పన్నెండు సంవత్సరాలు. ''రామచరిత మానస'' గురించీ, దాని పారాయణంలో ఉన్న మహత్తు గురించీ ఒక ఉపాధ్యాయుడు చెప్పగా మాధవ్ విన్నాడు. ఆ గ్రంధాన్ని చదవాలని నిర్ణయించుకున్నాడు. అవి సెలవు రోజులు. ఉదయం సాయంత్రం, పగలూ రాత్రీ రామాయణం చదువుతూ కూర్చున్నాడు. భోజనానికి కూడా బలవంతాన పిలిచి కూర్చో బెట్టవలసి వచ్చేది. ఐదు రోజులలో అతడు రామాయణం చదవడం పూర్తి చేశాడు. ఊరికే చదవడం కాదు. చౌపాయిలు, దోహాలూ, ఛంద్‌లూ ఎన్నింటినో కంఠస్థం చేశాడు. చాలా రోజులవరకూ అతని భావజగత్తు రామాయణం అయిపోయింది. తాయీకి, తన స్నేహితులకూ అతడు రామాయణంలోని ఘట్టాలు వినిపిస్తూ ఉండేవాడు. తాయీ అతనిని మరింతగా ప్రోత్సహించేది. ''అప్పుడు హనుమంతుడు

ఏమన్నాడు?'' అంటూ పసికట్టుకుని అడిగేది. మాధవ్ గంటసేపు ఆ ఘట్ట మంతా వినిపించేవాడు.

ఒకసారి మాధవ్ ఒక ఆంగ్ల కవితను మరాఠీలోనికి పద్యరూపంలో అనువదించాడు. మాధవ్ స్నేహితులు దానిని ఉపాధ్యాయునికి చూపించారు. ''ఇది నిజంగా నీవు వ్రాసిందేనా? నమ్మలేకపోతున్నాను'' అని ఉపాధ్యాయుడు మాధవ్‌ను అడిగాడు.

''అనువాదం చేసింది నేనే. కానీ, ఆ విషయం ఎలా రుజువు చేయగలను? సాక్షులను తీసుకురావడం సాధ్యంకాదు కదా! అయినా ఒక పని చేయవచ్చు. మీరు మరో కవిత ఇవ్వండి. మీ ఎదుటే అనువాదం చేయించండి'' అని మాధవ్ సమాధానం ఇచ్చాడు

ఇంగ్లీషు పుస్తకంలోని ఒక కవితను ఉపాధ్యాయుడు మాధవ్‌కు ఇచ్చాడు. మాధవ్ అక్కడే ఆయన ఎదుట కూర్చున్నాడు. కొద్దిసేపటిలో మరాఠీలో పద్యరూపంలో దానిని అనువదించి ఇచ్చాడు. ఆ వ్రాతలో ఎక్కడా దిద్దుళ్ళూ, కొట్టివేతలూ లేవు. మాటమార్చే అవసరం రాలేదు. వ్రాస్తున్నప్పుడు ఎక్కడా ఆగలేదు. నట్టుపడలేదు. కొద్దిసేపు అతడు ఆ కవితో, కవితతో మమేకం అయిపోయాడు అతడు అలా వ్రాస్తూ పోతున్నాడు. ఉపాధ్యాయుడు ప్రేమగా, ఆశ్చర్యంగా అతనిని పరిశీలిస్తున్నాడు. ఆ మరాఠీ అనువాదం పూర్తిగా చదివి ఆయన విస్తుపోయాడు. ''అందంగా ఉంది'' ''అద్భుతంగా ఉంది'' అనే మాటలు ఆయన నోటినుంచి అప్రయత్నంగా వెలువడ్డాయి. ఆయన ఆ అనువాదాన్ని తోటి ఉపాధ్యాయులకు చూపించాడు. అంతా మెచ్చుకున్నారు. ఆ ఉపాధ్యాయుడు ఆ కవితను తరగతిలోని విద్యార్థులందరికీ చదివి వినిపించాడు ''మాధవ్ కవిత వ్రాస్తున్నప్పుడు అతని తన్మయత్వం చూసితీరాలి. లేఖన - సమాధికి ఉత్తమ ఉదాహరణ అది'' అని ఆయన ప్రతి ఒక్కరికీ చెప్పాడు.

ఇంతటి ప్రశంస అందుకున్నప్పుడు ఎవరికైనా గర్వం కలుగుతుంది.

కానీ, మాధవ్ పూర్వంలాగే శాంతంగా, నమ్రంగా, వినయ విధేయతలతో ఉండిపోయాడు

మాధవ్ ఏ పని తలపెట్టినా, తన శక్తియుక్తులు అన్నింటినీ ఒడ్డి ఏకాగ్రమైన మనస్సుతో దానిని సాధించేవాడు.

మాధవ్ ప్రతి రోజూ ఉదయం నియమం ప్రకారం సూర్యనమస్కారాలు చేసేవాడు. సాయంత్రం హాకీ ఆడేవాడు. వ్యాయామశాలకు వెళ్ళేవాడు. దండీలు, బస్కీలు తీసేవాడు. ''మల్‌ఖంబ్ (స్తంభంమీద చేసే కసరత్తు) వ్యాయామం చేసేవాడు. చాందాలోని ఒక ఉపాధ్యాయుడు మాధవ్‌కు వ్యాయామం పట్ల ప్రత్యేక ఆకర్షణ కలిగించాడు. ఆయన స్వయంగా మల్ ఖంబ్‌లో ఆరితేరిన వ్యక్తి. మాధవ్‌కు కూడా ''మల్‌ఖంబ్'' వ్యాయామం పట్ల ఆసక్తి ఏర్పడింది.

ఒకరోజున రాత్రి బాగా పొద్దుపోయినా మాధవ్ ఇంటికి రాలేదు. తాయీ గాబరా పడింది. ''మాధవ్ ఇంకా రాలేదేమిటి? రోజూ పెందలాడే వచ్చేవాడు కదా''అని భావుజీతో అన్నది.

''త్రోవలో ఉండి ఉంటాడు. అయినా వాడు పసిపిల్లవాడు కాడు కదా! ఏదో కుస్తీ పోటీ చూస్తూ ఉండిపోయి వుంటాడు'' అని భావుజీ సమాధాన పరచారు.

మరో అరగంట గడిచింది. మాధవ్ అప్పటికీ రాలేదు. తాయీ ఉండబట్టలేకపోయింది. ''వాడు ఎప్పుడూ ఇంత ఆలస్యం చేయలేదు. మీరు కాస్త చూసి వస్తే మంచిది'' అని భావుజీతో చెప్పింది.

వెంటనే భావుజీ వ్యాయామ ఉపాధ్యాయుని ఇంటికి వెళ్ళారు. ''ఏమండీ మా మధు ఇంకా ఇంటికి రాలేదేమిటి?'' అని అడిగారు.

''ఏమిటీ? ఇంతవరకూ ఇంటికి రానేలేదా? పిల్లలంతా ఎప్పుడో వెళ్ళిపోయారు. అందరూ వెళ్ళిపోయిన తర్వాతే నేను అక్కడి నుంచి

బయలుదేరాను'' అని ఆయన సమాధానం చెప్పారు.

అప్పుడు ఆయనకో ఆలోచన తట్టింది. మధు వ్యాయామశాలకు తిరిగి వెళ్లి ఉండవచ్చు. అతను పట్టిన పట్టు విడచేవాడు కాడు. ఆయన భావుజీని ఇంటికి వెళ్ళమని చెప్పారు. తాను వ్యాయామశాలవైపు వెళ్ళారు. ఆయన అనుకున్నదే జరిగింది. మాధవ్ వ్యాయామశాలలోనే ఉన్నాడు. మల్‌ఖంచ్ మీద ఆ రోజునే నేర్పిన క్రొత్త ప్రయోగం అభ్యాసం చేస్తున్నాడు. అధ్యాపకుడు అతని దగ్గరికి వెళ్ళాడు. ''సెభాష్ మాధవ్, ఈ రోజు నేర్పిన ప్రయోగం నీకు క్షుణ్ణంగా వచ్చింది. ఇక వెంటనే ఇంటికి వెళ్ళు. బాగా ఆలస్యమయింది. భావుజీ, తాయీ నీ కోసం ఎదురుతెన్నులు చూస్తున్నారు'' అన్నాడు.

మాధవ్ క్షణంలో మామూలు బట్టలు వేసుకొని ఇంటిదారి పట్టాడు.

# 8. బహుముఖ ప్రతిభ

1922లో మాధవ్ చందా హైస్కూలులో చదివాడు. ఆ స్కూలు నుంచి మెట్రిక్ పరీక్ష ప్యాసయ్యాడు. పై చదువుగురించి అతడు ఎవరితోనూ మాట్లాడలేదు. ఎలాంటి ప్రయత్నమూ చేయలేదు.

అందువల్ల ఒకరోజున భావుజీ తాయీతో ఇలా అన్నారు. ''సంగతేమిటి? మన సవాయీ మాధవరావు ఇకముందు ఏమి చేయదలచుకున్నాడు? అందుకు ఏదైనా ఏర్పాటు చేయాలి కదా?''

తాయీ ఆ విషయం మాధవ్‌ను అడిగింది. ''అమ్మా, ఈ సంవత్సరాన్ని నేను హనుమంతుని పాదాలవద్ద సమర్పించాలని అనుకుంటున్నాను. అంటే వ్యాయామం చేయాలని ఉంది. లోకమాన్య తిలక్ ఇలాగే చేశారు. శారీరక బలం అనే పెట్టుబడి ఆ తర్వాత ఆయనకు ఎంతో ప్రయోజనం కలిగించింది. ముందు ముందు ఎలాంటి పరిస్థితులను అయినా ఎదుర్కొనడానికి వీలుగా శరీరాన్ని గట్టిపరచుకోవాలని నా ఆలోచన'' అని మాధవ్ జవాబు చెప్పాడు.

తాయీ ఆ మాట భావుజీతో చెప్పింది. ఆయన తోటి ఉపాధ్యాయులతో చెప్పారు. ఆ తర్వాత అంతా కలిసి మాధవ్‌ను ఏదోవిధంగా ఒప్పించారు మాధవ్‌ను డాక్టర్ చేయాలని భావుజీ ఆలోచన. వైద్యవిద్య ద్వారా సేవ, ధనసంపాదన రెండూ సమకూరుతాయని ఆయన హితవు చెప్పారు ఆ మాట మాధవ్‌కు నచ్చింది. అందుకోసం అతడు పూనా వెళ్ళాడు. ఇంటర్ సైన్స్‌లో చేరడానికి ఫర్గ్యుసన్ కాలేజీకి దరఖాస్తు పెట్టాడు కానీ, అప్పుడు అక్కడ ఓ నిబంధన అమలులో ఉంది. ఇతర ప్రాంతాల విద్యార్థులకు ప్రవేశం ఉండదు అందువల్ల మాధవ్ నాగపూర్ తిరిగి వచ్చి, హిస్లాప్ కాలేజీలో చేరాడు.

ఉదయం, సాయంత్రం వ్యాయామం చేయడం. గ్రంథ పఠనం మంచి మంచి సూక్తులూ, ''కొటేషన్''లు వ్రాసుకోవడం వాటిని కంఠస్థం చేయడం. దేవాలయాలకు వెళ్ళి పురాణాలు, ప్రవచనాలు, సంకీర్తనలు వినడం. మిగతా సమయంలో పాఠాలు చదవడం. ఇదీ మాధవ్ దినచర్య.

హిస్లాప్ కాలేజీ క్రైస్తవ మిషనరీలు నడిపే సంస్థ. అక్కడ రోజూ ఒక గంట బైబిల్ బోధనకు కేటాయిస్తారు. విద్యార్థులలో హెచ్చుమంది ఆ క్లాసులకు వెళ్ళరు. వెళ్ళే వాళ్ళు కూడా చెప్పేది సరిగా వినరు. మాధవ్ మాత్రం శ్రద్ధగా వినేవాడు. ఇంటిదగ్గర కూడా బైబిల్ క్షుణ్ణంగా చదివేవాడు. అందులోని పెక్కు అధ్యాయాలు కంఠస్థం చేశాడు.

ఒకరోజున ప్రిన్సిపాల్ గార్డినర్ స్వయంగా బైబిల్‌లోని ఒక అధ్యాయానికి అర్థం చెపుతున్నారు. బైబిల్‌లోని ఫలానా అధ్యాయంలో ఇలా ఉంది అంటూ, ఆయన కొన్ని వాక్యాలు వినిపించారు. అప్పుడు మాధవ్ లేచి నిలబడ్డాడు. ''సర్, మీరు ఉదహరించిన వాక్యాలు ఆ అధ్యాయంలో లేవనీ, మరో అధ్యాయంలో ఉన్నాయనీ నా మనవి'' - అని చెప్పాడు. గార్డినర్ వెంటనే బైబిల్ ప్రతి తెప్పించి చూశారు. ఆయన ఉదారుడు. ఆయన మనసు మంచిది. గోళ్వాల్కర్ చెప్పింది నిజమేనని ఆయన గుర్తించారు. గోళ్వాల్కర్‌ను ముక్త కంఠంతో ప్రశంసించారు ఆ రెండు సంవత్సరాలలో మాధవ్ బైబిల్‌కు సంబంధించిన అనేక గ్రంథాలు చదివాడు.

ఆ రోజుల్లోనే వేణువు వాయించే సావలారామ్‌జీతో మాధవ్‌కు గాఢ స్నేహం ఏర్పడింది. అతడు రోజూ అంధుడైన సావలారామ్ ఇంటికి వెళ్ళి వేణువు వాయించడం నేర్చుకున్నాడు. కొద్దికాలంలోనే అతనికి వేణువు వాయించడంలో మంచి నైపుణ్యం వచ్చింది. అతడు సావలారామ్‌జీకి ప్రియశిష్యుడు అయినాడు ఆయనను సైకిల్ మీద ఎక్కించుకు తీసుకొని వెళ్ళేవాడు. ఆయనకు చిన్నా పెద్దా పనులు చేసిపెట్టేవాడు

ఇన్నిపనులు చేస్తూ కూడా మాధవ్ ఇంటర్ సైన్స్ పరీక్షలో చక్కటి మార్కులు తెచ్చుకున్నాడు. ఇంగ్లీషులో మెడల్ సంపాదించాడు. ఆ తర్వాత మెడికల్ కాలేజీలో సీటు కోసం లక్నో వెళ్ళాడు. సీటు దొరకలేదు. అప్పుడు కాశీ వెళ్లి విశ్వవిద్యాలయం విజ్ఞానశాస్త్ర విభాగంలో చేరాడు

కాశీలో ఉన్నంతకాలం మాధవ్ రోజూ గంగానదిని తప్పకుండా దర్శించేవాడు. ఒక్కోసారి వెళ్ళి ఘాట్‌మీద కూర్చునేవాడు. ఒక్కోసారి ఇసుక తిన్నెలమీద పడుకునేవాడు. ఒక్కోసారి పడవ షికారుకు వెళ్ళేవాడు. ఒక్కోసారి నదీజలాలను తదేకంగా చూస్తూ ఉండిపోయేవాడు. ఒక్కోసారి అక్కడే ధ్యానం చేసేవాడు. అప్పుడప్పుడు పండిత మదనమోహన మాలవ్యా వద్దకు వెళ్లి కూర్చునేవాడు. తరచూ శ్రీ రామకృష్ణ ఆశ్రమానికి వెళ్ళి, అక్కడి సేవాకార్యక్రమాలలో పాల్గొనేవాడు. ఆ రోజులలో అతడి అధ్యయనం బాగా పెరిగిపోయింది. భారతీయ తత్వశాస్త్రం, అర్థశాస్త్రం, రాజనీతి శాస్త్రం వంటి శాస్త్రములలో మూలగ్రంథాలు, ప్రమాణ గ్రంథాలు అనేకం అతడు అధ్యయనం చేశాడు. 1926లో బి.ఎస్.సి. ప్రథమ శ్రేణిలో ప్యాసయ్యాడు. 1928లో జీవశాస్త్రంలో ఎమ్.ఎస్.సి. ప్రథమ శ్రేణిలో ప్యాసయ్యాడు.

# 9. నా లక్ష్యం ఏమిటి ?

తేజస్వి, మేధావి, అధ్యయనశీలి అయిన ఆ యువకుణ్ణి అందరూ ఇప్పుడు మాధవరావు అని పిలుస్తున్నారు. ఎమ్.ఎస్.సి. ప్యాసయి ఆయన

ఇంటికి తిరిగి రావడంతో భావుజీ, తాయీలు ఎంతగానో ఆనందించారు. మనం అల్లారుముద్దుగా పెంచిన మధు విద్యాశాఖలో ఉద్యోగం చేయాలి పెళ్ళి చేసుకోవాలి. ముసలితనంలో మనకు అండగా ఉండాలి. ఇలా అనుకుని, వారు తమ భావాలను మాధవరావుకు తెలిపారు మాధవరావు తన అభిప్రాయం వారికి ఇలా తెలిపారు ''నేను ప్రభుత్వ ఉద్యోగం చేయను. ఎన్నడూ ఆంగ్లపాలకులకు సేవ చేయలేను. నేను పై చదువు చదవాలి. జీవశాస్త్రంలో పరిశోధన చేయాలని వుంది. డి.ఎస్ సి. చేయాలని వుంది.''

భావుజీకి విద్య అంటే ప్రాణం. తన కుమారుడు అత్యున్నత విద్య అభ్యసించాలని ఆయన కోరిక. మరోప్రక్క, తనకు ఒక్కగానొక్క కొడుకు. అతడు త్వరలో స్థిరపడాలి. తాయీ అభిప్రాయమూ అదే. ఆమె తన మనసులోని మాట భర్తకూ, కొడుకుకూ పదేపదే చెపుతూ వుండేది. భావుజీ మనసులో కొద్ది సమయం సంఘర్షణ జరిగింది. చివరికి విద్యాభిమానమే గెలిచింది. ఆయన మాధవరావుకు అనుమతి ఇచ్చారు. జీవశాస్త్రంలో ఉన్నత విద్యకు మద్రాసులో మంచి ఏర్పాట్లు ఉన్నాయి. అందువల్ల మాధవరావు మద్రాసు చేరారు.

మద్రాసు వాతావరణం, అక్కడి నీళ్ళు, అక్కడి ఆహారం అంతా వేరు. అవి మాధవరావుకు పడలేదు. ఆయనకు తరచు జ్వరం వచ్చేది. తండ్రిగారు ఉద్యోగ విరమణ చేశారు. అందువల్ల తగినంత డబ్బు పంపలేకపోతున్నారు. పెద్ద పెద్ద పుస్తకాలు కొనవలసి వచ్చింది. డాక్టర్లకూ మందులకూ బోలెడు డబ్బు ఖర్చయింది. ఇలా ఆరోగ్యమూ, ఆర్థిక పరిస్థితీ దెబ్బతిన్నాయి. ఇందుకుతోడు ఆయన మనసులో కూడా సంఘర్షణ ప్రారంభమైంది.

భవిష్యత్తులో నేను ఏమి చెయ్యాలి? నా జీవన లక్ష్యం ఏమిటి? దిగజారిపోతున్న దేశ పరిస్థితిని మెరుగుపరచడానికి నేను ఏమి చెయ్యగలను? ఏమి చేయాలి? ఆంగ్లపాలకుల అత్యాచారాలు మితిమీరిపోతున్నాయి. వారితో పోరాటం సాగించడం నా కర్తవ్యం కాదా? విప్లవాదుల ఉద్యమం దేశవ్యాప్తం

కాగలదా? సామాన్య ప్రజలు విప్లవోద్యమం కార్యకలాపాలలో పాల్గొనగలరా? సత్యాగ్రహం, స్వదేశీ, బహిష్కరణలవంటి మార్గాల ద్వారా మనకు స్వరాజ్యం లభిస్తుందా? బానిసత్వ బంధాలనుంచి మన దేశాన్ని విముక్తి చేయడం ఎలా? మన సమాజంలో కార్యశీలతనూ, సాహసాన్నీ నిర్మించడం ఎలా? భారతదేశం తన ప్రాచీన గౌరవాన్ని తిరిగి పొందడం ఎలా? ఈ పనులన్నింటిలో నా బాధ్యత ఏమిటి? ఇలా ఎన్నెన్నో ప్రశ్నలు ఆయనను వేధిస్తున్నాయి.

ఇలా శారీరకంగా, ఆర్థికంగా, మానసికంగా, బుద్ధిపరంగా సంఘర్షణలో తలమునకలు అవుతూ కూడా - తన కార్యకుశలత కారణంగా, పరోపకార స్వభావం కారణంగా, ఆయన తోటి విద్యార్థుల ప్రేమనూ, అధ్యాపకుల వాత్సల్యాన్నీ చూరగొన్నారు. విశ్వవిద్యాలయంలో ఏ కార్యక్రమం జరిగినా, మాధవరావ్ గోళ్వాల్కర్ దానికి సూత్రధారిగా ఉండేవారు. ఆయనలోని స్వార్థరాహిత్యం, పని నేరుపు అందరి మన్ననలూ అందుకున్నాయి.

మద్రాసులో ఒక పెద్ద మత్స్యాలయం ఉంది. పెద్ద తరగతి విద్యార్థులకు దాని అజమాయిషీ అప్పజెప్పారు. మత్స్యాలయాన్ని చూడటానికి వచ్చేవారు ప్రవేశ రుసుము చెల్లించాలి. ఒకరోజున నిజాం నవాబు సపరివారంగా మత్స్యాలయాన్ని చూడటానికి వచ్చారు. ఆయన అసలే పిసినారి. నేను నవాబును. ప్రవేశ రుసుము కట్టమని నన్ను ఎవరు అడుగుతారు? అని ఆయన అనుకుని ఉండవచ్చు. అంత గొప్పవ్యక్తి. ప్రపంచ ప్రఖ్యాతి గడించిన వ్యక్తి. సుల్తాను. రుసుము ఇవ్వమని ఎవరు అడుగుతారు? ఎలా అడుగుతారు? అడిగితే ఏ ప్రమాదమో! ఉద్యోగం పోయినా పోవచ్చు - అని మత్స్యాలయం ఉద్యోగులు భావించారు. అందువల్ల ఎవ్వరూ ముందుకు రాలేదు. ఎవరికీ ఆ ధైర్యం లేకపోయింది. అప్పుడు మాధవరావ్ సరాసరి నిజాము నవాబు వద్దకు వెళ్లారు. ''అయ్యా! ఇక్కడ ప్రవేశ రుసుము కట్టవలసి వుంటుంది. కట్టి టికెట్లు తీసుకోకుండా మీరుకానీ, మీవెంట ఉన్న వారుకానీ లోపలికి వెళ్ళడానికి వీలులేదు'' అన్నారు.

ఆ మాట వినగానే నిజాం నవాబు తన అంతరంగిక కార్యదర్శివైపు చూశారు. అతడు టికెట్లు కొన్నాడు. విద్యార్థులు వారికి  మత్స్యాలయం చూపించారు

వారంతా వెళ్ళిపోయిన తర్వాత మత్స్యాలయం అధికారులు ఆందోళన చెందారు.  ''మనం వీరినుంచి రుసుము తీసుకోకపోతే మిన్ను విరిగి మీద పడేదా? సంస్థకు నష్టం వచ్చేదా?''అని ఒక అధికారి వ్యాఖ్యానించాడు.

మాధవరావు ఇలా జవాబు చెప్పారు : ''ఇది లాభ నష్టాలకు సంబంధించిన విషయం కాదు. నియను పాలనకు సంబంధించిన విషయం. అంతా సక్రమంగా నియమాన్ని పాటించాలి  పెద్దవాళ్ళని పిలువబడేవాళ్ళు మరింత శ్రద్ధగా నియమాన్ని పాటించాలి. సామాన్యులు ఎప్పుడూ పెద్దవాళ్ళను అనుసరించి నడుచుకుంటూ ఉంటారు. మినహాయింపు అంటూ ఇవ్వవలసివస్తే - పేదవాళ్ళకే ఆ సౌకర్యం కల్పించాలి.''

మాధవరావు ఆరోగ్యం మరింతగా దెబ్బతిన్నది. మద్రాసులో ఉండటం అసాధ్యమైపోయింది. పరిశోధనను సగంలోనే వదులుకోవలసి వచ్చింది. ఆయన నాగపూర్‌కు తిరిగి వచ్చారు. చికిత్స  ప్రారంభమైంది. క్రమంగా ఆయన ఆరోగ్యం మెరుగైంది. ఆ రోజుల్లో ఆయన శ్రీ రామకృష్ణ ఆశ్రమానికి తరచు వెళ్ళేవారు. ఆశ్రమం అధిపతి శ్రీ భాస్కరేశ్వరానందజీతో ఆధ్యాత్మిక విషయాలపై చర్చ జరిపేవారు. స్వామీజీ మాటలు వింటూ మాధవరావు తన్మయం చెందేవారు. ఆ రోజుల్లోనే వివేకానందస్వామి సాహిత్యం అంతా మరో మారు  చదివారు.

ఇంటి ఆర్థిక పరిస్థితి ఉద్యోగం చేయమని మాధవరావును ఒత్తిడి చేస్తున్నది. ఆయన అందుకు ప్రయత్నాలు సాగించారు. అదృష్టవశాత్తు 1930లో ఆయనకు కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో లెక్చరర్ ఉద్యోగం లభించింది.

# 10. సంఘంతో పరిచయం

కాశీ వాతావరణం మాధవరావుకు పరిచితమే ఆయనకు బాగా నచ్చిన వాతావరణం అది. ఇక విద్యాబోధన ఆయన స్వభావానికి అనుగుణమైనది. ఆయన అభిరుచికి పోషకమైనది. ఉదయం స్నానసంధ్యలు ముగించుకుని ఆయన ఆ రోజు చెప్పవలసిన పాఠం తయారుచేసుకునేవారు. ఒక రోజున చెప్పవలసిన విషయం తేలికగా ఉన్నప్పటికీ, ఆయన దానిని చదివేవారు. విద్యార్థులకు ఏవిధంగా బోధించాలో ఆలోచించుకునేవారు. నోట్సు తయారు చేసేవారు. వివిధ విషయాలలో ఆయన జ్ఞానసంపద అపారమైనది. ఆయన పాఠం చెప్పే తీరులో విజ్ఞానం, వినోదం కలబోసుకుని ఉండేవి. ఆయన విద్యార్థులతో కలుపుగోలుగా ఉండేవారు. వ్యక్తిగత విషయాలు అడిగి తెలుసుకునేవారు. ఆయన తమ పెద్దన్నగారని విద్యార్థులకు అనిపించేది. వారు ఆయన ఇంటికి వచ్చిపోతూ ఉండేవారు. ప్రేమతో, ఆదరంతో గురూజీ అని ఆయనను పిలువసాగారు.

ఆయన సాయంత్రంపూట టెన్నిస్ ఆడేవారు. ఇంటికి వచ్చి సంధ్యావందనం చేసి, స్వల్పంగా భోజనం చేసి చదువు మొదలుపెట్టేవారు. అలా రాత్రి రెండు గంటలవరకూ చదివేవారు ఉపనిషత్తులు, సంస్కృతంలోని మహాకావ్యాలు, పాశ్చాత్య దర్శనశాస్త్రం, సమాజశాస్త్రం, రాజనీతిశాస్త్రం వంటి విషయాలలో ప్రామాణిక గ్రంథాలు చదివేవారు. ఆయన గదిలో ఎటు చూసినా పుస్తకాలు పడి ఉండేవి. ఆయన చదువు నిర్విరామంగా కొనసాగేది. ఒక రోజున ఆయనకు తీవ్రంగా జ్వరం వచ్చింది. అయినా ఆయన చదువుతునే ఉన్నారు.

''ఆరోగ్యం బాగుండలేదు. జ్వరం హెచ్చుగా ఉంది. అయినా ఆయన చేతిలో పుస్తకం ఉంది. ఇది వట్టి మొండిపట్టు'' అని ఒక మిత్రుడు అన్నాడు.

''భాయీ, జ్వరం దాని పని అది చేస్తోంది. నేను నా పని చేస్తున్నాను. మొండిపట్టు ఆ జ్వరానిదే. నాది కాదు, ఇది నేను రోజూ చేస్తున్నదే'' అని మాధవరావు జవాబు చెప్పారు.

ఒక రోజున ఆయన కాలికి తేలు కుట్టింది. విషం దిగడానికై ఆయన నీళ్ళు నిండిన బకెట్‌లో కాలు పెట్టారు. ప్రశాంతంగా చదువుకుంటున్నారు. చిత్రంగా ఉందే తేలు కుట్టింది. బాధ పెడుతోంది. అయినా చదువు సాగిపోతోంది. అని ఒక మిత్రుడు ఆశ్చర్యం వ్యక్తం చేశాడు.

భాయీ , తేలు నా కాలుమీద కుట్టింది. తలమీద కుట్టలేదు - అని గురూజీ నవ్వుతూ జవాబు చెప్పారు.

పుస్తకాలు చదవడం అంటే ఆయనకు అంత ఇష్టం. ఆయన మనసుకు ఉన్న ఏకాగ్రత అలాంటిది. పాఠం చెపుతున్నప్పుడు కూడా ఆయన అందులో పూర్తిగా లీనమైపోయేవారు. మంచి విద్వత్తు, చదువు చెప్పడంలో ఎంతో నేర్పు కలిగిన అధ్యాపకుడుగా ఆయన పేరుపొందారు. అంతకుమించి ఆయన పరోపకారం ప్రవృత్తి ఎందరినో ఆకర్షించింది. ఎందరో పేద విద్యార్థుల పరీక్ష ఫీజు ఆయన కట్టేవాడు. ఎందరికో పుస్తకాలు కొనడానికి డబ్బు ఇచ్చేవారు. జబ్బు పడిన విద్యార్థులను ఆయన స్వయంగా డాక్టరు వద్దకు తీసుకువెళ్ళేవారు. స్వంత ఖర్చుతో వారికి మందులిప్పించేవారు.

భయ్యాజీ దాణీ ఆయన స్నేహితుడు. భయ్యాజీ హెచ్చు సమయం సంఘం పనికి, ఇతర సామాజిక కార్యకలాపాలకూ వినియోగించేవారు. తన బి.ఏ. పుస్తకాలు ముట్టుకోలేదు. అందువల్ల పరీక్షకు వెళ్లకూడదని నిర్ణయించుకున్నారు. మాధవరావుకు ఆ సంగతి తెలిసింది. ఆయన భయ్యాజీని పిలిపించారు. నీవు పరీక్షకు వెళ్ళవలసిందే అని నొక్కి చెప్పారు.

''నేను అసలు పుస్తకాలు ముట్టుకోనే లేదు. పరీక్షలో ఏమి వ్రాస్తాను'' అని భయ్యాజీ సందేహం వ్యక్తం చేశారు.

''నేను నీచేత చదివిస్తాను. నేను తయారుచేసే నోట్సు క్షుణ్ణంగా చదువు ప్యాసైపోతావు'' అని మాధవరావు ఉపాయం చెప్పారు.

భయ్యాజీ సరే అన్నారు. మాధవరావు బి.ఏ. పుస్తకాలు అన్నీ చదివి నోట్సు తయారు చేశారు. ప్రశ్నలు, జవాబులు వ్రాశారు. భయ్యాజీ చేత ముఖ్య భాగాలన్నీ కంఠస్థం చేయించారు. భయ్యాజీ పరీక్షకు వెళ్లారు. ప్యాసయ్యారు. ఇతర విద్యార్థులలాగే ఆయన కూడా మాధవరావును గురూజీ అని పిలవసాగారు.

భయ్యాజీ కారణంగా కాశీ హిందూ విశ్వవిద్యాలయంలోని ఇతర స్వయంసేవకుల కారణంగా మాధవరావుకు సంఘంతో పరిచయం ఏర్ప డింది. సంఘ సంస్థాపకుడు డాక్టర్ హెడ్గేవార్‌జీ కాశీ వచ్చినప్పుడు కార్యకర్తలు మాధవరావును ఆయన వద్దకు తీసుకువెళ్లారు. మాధవరావు డాక్టర్‌జీ వ్యక్తి త్వాన్ని చూశారు. ఆయనతో మాట్లాడారు. ఎంతగానో ప్రభావితులయ్యారు. నాటినుంచి అప్పుడప్పుడు సంఘశాఖకు వెళుతూ ఉండేవారు.

సంఘ ఉత్సవం చూడటానికి నాగపూరు రావలసిందిగా డాక్టర్ హెడ్గేవార్‌జీ ఆయనను ఆహ్వానించారు. ఆ ప్రకారం ఆయన నాగపూర్ వచ్చారు. డాక్టర్‌జీ ఆయనను తనతోపాటు భండారా తీసుకువెళ్ళారు. మాధవరావు అక్కడి సంఘశాఖ చూశారు. ఈ పర్యటనలో మాధవరావు డాక్టర్‌జీని సన్నిహితంగా చూశారు. సంఘాన్ని గురించి ఎన్నో ప్రశ్నలు వేశారు. డాక్టర్‌జీ చెప్పిన సమాధానాలు విని తృప్తిపొందారు. నాగపూర్ నుంచి కాశీ తిరిగివెళ్ళారు. ఆ తర్వాత కాశీలోని సంఘశాఖ గురించి మరింత శ్రద్ధ తీసుకోవడం మొదలు పెట్టారు.

ఆ రోజుల్లో సంఘశాఖలో ప్రాథమిక సైనిక శిక్షణ గరపేవారు. కవాతు చేస్తున్నప్పుడు స్వయంసేవకులు కర్రతో తయారైన నకిలీ తుపాకులు ఉపయో గించేవారు. స్వయంసేవకుల సంఖ్యతో పోల్చితే తుపాకులు తక్కువగానే ఉన్నాయి. క్రీడలు, వ్యాయామాలకు వాడే ఇతర పరికరాలూ తక్కువగానే

ఉన్నాయి. యోగచాప్‌లు కొత్తవి తయారు చేయించవలసి ఉన్నది. ఈ సంగతి మాట్లాడుకోవడం మాధవరావు విన్నారు. ఎవరితోనూ చెప్పకుండా ఆయన ఆ పరికరాలు అన్నింటినీ తయారు చేయవలసిందిగా పనివాళ్ళను పురమాయించారు వాటికయిన ఖర్చు తాను భరించారు. ఆ పరికరాలు అన్నింటినీ సంఘకార్యాలయంలో అమర్పించారు.

అందంగా మెరుస్తూ ఉన్న ఆ పరికరాలన్నీ ఒకేసారి రావడం చూసి స్వయంసేవకులంతా చకితులైనారు. మరి ఈ పరికరాలు అన్నింటినీ తయారు చేయించింది ఎవరు? తయారుచేసిన పనివాళ్ళు ఎవరు? ఆ పని పురమాయించింది ఎవరు ? ఆ ఖర్చు భరించింది ఎవరు? చాలా రోజుల వరకూ ఈప్రశ్నలకు జవాబులు ఎవరికీ దొరకలేదు. తాను చేసిన మంచిపని గురించి మాధవరావు నోటినుంచి ఎన్నడూ ఒక్క అక్షరమైనా వెలికి రాలేదు.

మాధవరావు స్నేహితుడు ఒకరికి రాజకీయాలను గురించి వాదించడం మహా సరదా. ఒక రోజున ఆయన ఒక వాదాన్ని ఆవేశంగా సమర్థించసాగాడు. అప్పుడు మాధవరావు ఆయనతో ఇలా దృఢంగా చెప్పారు :

''నేను చెప్పేమాట వ్రాసి వుంచుకో ఒకరోజున సంఘవాదం వెల్లువలా పెల్లుబుకుతుంది. సంఘం పేరు దశదిశలా మారుమ్రోగుతుంది. నేడు సామ్యవాదం, సమాజవాదం వంటి వాదాల నగారాలు మ్రోగుతున్నాయి. అయితే సంఘవాదం ముందు అవన్నీ వెలాతెలాపోయే రోజు వచ్చి తీరుతుంది.''

# 11. గురూజీ

సంఘ స్వయంసేవకులు అధిక సంఖ్యలో మాధవరావ్‌జీ ఇంటికి వెళ్ళిరావడం మొదలుపెట్టారు. మాధవరావ్‌జీ కూడా తరచు స్వయంసేవకుల ఇళ్ళకు వెళ్ళేవారు. సిద్ధాంత చర్చల పరిధి దాటి ప్రేమతో, బంధుభావనతో కూడిన సంబంధం ప్రారంభమైంది. ఏ స్వయంసేవకునకు ఇబ్బంది వచ్చినా, ఆయన ఎంతో ఆత్మీయతతో దానిని తొలగించేవారు. స్వయంసేవకుల మధ్య కూర్చొని ఆయన నవ్వుతూ నవ్విస్తూ కబుర్లు చెప్పేవారు. ముఖ్యకార్యకర్తలను

వెంట తీసుకొని కాశీ హిందూ విశ్వవిద్యాలయం నిర్మాత, అధినేత పండిత మదనమోహన్ మాలవ్యా వద్దకు వెళ్ళేవారు. మాలవ్యాజీ సంఘకార్యాన్ని ఎంతగానో మెచ్చుకునేవారు. ఆయన విశ్వవిద్యాలయం సమీపంలో సంఘశాఖల పరికరాలు భద్రపరచుకోవడానికై ఒక చిన్న ఇల్లు కట్టించారు.

ఒకసారి విశ్వవిద్యాలయంలో పెద్ద ఉత్సవం జరిగింది. ఉత్సవం ఏర్పాట్ల బాధ్యత సంఘ స్వయంసేవకులకు అప్పగించారు. ఎవరు ఏ ద్వారం గుండా రావాలో, ఎక్కడ కూర్చోవాలో అంతా నిర్ణయమైంది ఆ ప్రకారం ఆయా స్థలాలలో స్వయంసేవకులు నిలబడ్డారు. ఎవరు ఎటు వెళ్లాలో చెపుతున్నారు. నియమాలను ఉల్లంఘించడం కొందరికి సరదా నియమాలు మా కోసం కాదు. ఏ నియమాన్నీ మేము పాటించం. అని చెప్పుకోవడం గొప్ప అనుకుంటారు అలాంటివాళ్ళు. ఒక సీనియర్ అధ్యాపకుడు ఆ తరహా వ్యక్తి. స్త్రీలకోసం ఏర్పాటు చేసిన ద్వారం నుంచి లోపలికి రాబోయాడు ఆయన. స్వయంసేవకులు ఎంతో వినయంగా ఆయనను '' పురుషుల ద్వారం అదండీ'' అని చూపారు. ఆయన వారితో వివాదానికి దిగాడు. కోపోద్రేకంతో ఇష్టం వచ్చినట్టు మాట్లాడాడు మొండిపట్టు పట్టాడు. ''నన్ను ఆపడానికి మీరెవరు? నేను ఈ ద్వారం నుంచే వెళతాను. మీకు చేతనైనది చేసుకోండి'' - అని మొరాయించాడు. స్వయంసేవకులంతా మౌనం వహించారు. వస్తాదులా ఉండే ఓ స్వయంసేవక్ ముందుకు వచ్చాడు. ఆ పెద్దమనిషి రెక్కపుచ్చుకుని పురుషుల ద్వారం నుంచి తీసుకువెళ్ళి కూర్చోపెట్టాడు.

ఉత్సవం జయప్రదంగా ముగిసింది. అయితే, ఆ సీనియర్ అధ్యాపకుని మనసును దొలుస్తూనే వుంది. ఆ సంఘటన విశ్వవిద్యాలయ అధికారుల సమావేశంలో ఆయన దానిని చిలవలు పలవలు చేసి వర్ణించాడు. ప్రముఖ స్వయంసేవకులు కొందరిని విశ్వవిద్యాలయం నుంచి బహిష్కరించాలని కోరాడు. వెంటనే మాధవరావ్‌జీ లేచి నిలబడ్డారు. ఆయన దృఢంగా జరిగిన దంతా వివరించారు. స్వయంసేవకుల చర్యనూ, అందరూ క్రమశిక్షణను

పాటించవలసిన అవసరాన్ని గట్టిగా సమర్థించారు సమావేశానికి ముందే ఆయన మాలవ్యాజీకి సంగతంగా నివేదించి ఉన్నారు. అందువల్ల ఆ సీనియర్ అధ్యాపకుని మాట చెల్లుబడి కాలేదు.

కాశీలో మాధవరావ్‌జీ మూడు సంవత్సరాలు ఉన్నారు. అక్కడి ఉద్యోగం పూర్తయినప్పుడు ఆయన రామ్‌టెక్‌లో కానీ, నాగపూర్‌లో కానీ న్యాయవాది వృత్తి చేపట్టాలని భావుజీ, తాయీ అభిప్రాయం వ్యక్తం చేశారు అందువల్ల మాధవరావ్‌జీ మరో ఉద్యోగం కోసం పెద్దగా ప్రయత్నించలేదు నాగపూర్ వచ్చి, లా కాలేజీలో చేరారు.

కాశీలో ఉండగా, ఆయన స్వయంసేవక్ అయినారు. సంఘ కార్యకర్తలు పలువురితో ఆయనకు మైత్రి ఏర్పడింది. అంతా ఆదరంగా, అభిమానంగా ఆయనను గురూజీ అని పిలువసాగారు. గురూజీ అనే మాట ఆయనకు మారుపేరు అయింది. చివరికి డాక్టర్‌జీ కూడా ఆయనను గురూజీ అని పిలువసాగారు. గురూజీ నేడు స్వయంసేవకుల నుద్దేశించి మీరే మాట్లాడాలి అని డాక్టర్‌జీ ఒక రోజున ఆయనతో అన్నారు. డాక్టర్‌జీ మీరుకూడా నన్ను గూరూజీ అని పిలుస్తారా? అని ఆయన ఆశ్చర్యంతో అడిగారు.

ఎందుకు పిలవకూడదు? మీరు ఏదో ఒక తరగతికీ, పాఠశాలకూ మాత్రమే గురువుగారు కారుకదా. మీరు అందరికీ గురూజీయే - అని డాక్టర్‌జీ వెంటనే నవ్వుతూ సమాధానం చెప్పారు.

# 12. ఇల్లు వదిలి...

శ్రీ గురూజీ దినచర్య ఇప్పుడు పూర్తిగా మారిపోయింది. లా కాలేజీలో చదువు రెండు గంటలపాటు మాత్రమే. వేణువు వాయించే సావలారామ్‌జీ ఇంటిలో ఆయన ఎన్నో గంటలు గడిపేవారు. అక్కడ ఆయన వేణుగానం వినేవారు. స్వయంగా వీణ, వేణువు, సితార్ వంటి వాద్యాలు వాయించేవారు. ఒక్కోసారి అక్కడ మిత్రబృందం అంతా చేరేవారు. ఇక జోరుగా వాదోపవాదాలు సాగిపోయేవి. గురూజీ ముందు ఎవరూ నిలబడలేకపోయేవారు.

ఆయన చెప్పే మాట హేతుబద్ధంగా ఉండేది. ఆ మాటకు ఆధారం ఉండేది. ఆయన రోజూ ధంతోలీలో ఉన్న శ్రీరామకృష్ణ ఆశ్రమానికి వెళ్ళేవారు స్వామి శ్రీ భాస్కరేశ్వరానందజీకి ఆయనపట్ల ఉన్న అనురాగం ఇంతా అంతా కాదు. గురూజీ మేనమామ శ్రీరాయ్‌కర్‌జీ ట్యుటోరియల్ కాలేజీ నిర్వహించేవారు. గురూజీ ఆ కాలేజీలో రెండు మూడు గంటలు చదువు చెప్పేవారు. కాలేజీవారు నెలనెలా ఇచ్చే జీతంతో నాగపూర్‌లో ఆయనకయ్యే ఖర్చు వెళ్ళిపోయేది.

గురూజీ నాగపూర్ వచ్చిన తర్వాత డాక్టర్‌జీ ఆయన వద్దకు రాసాగారు. ఆయనకూడా డాక్టర్‌జీ ఇంటికి వెళుతూ ఉండేవారు. అప్పుడు కేంద్ర శాఖ తులశీబాగ్‌లో జరిగేది. గురూజీని ఆ శాఖ కార్యవాహగా నియమించారు. లాకాలేజీకి దసరా - దీపావళి సెలవులు ఇచ్చారు. అప్పుడే డాక్టర్‌జీకి బొంబాయి నుంచి ఒక ఉత్తరం వచ్చింది. బొంబాయిశాఖ అస్తవ్యస్తంగా ఉన్నదని ఆ లేఖలో వ్రాశారు. సమర్థుడైన కార్యకర్తను అక్కడకు పంపాలి. అప్పుడే శాఖ బాగుపడుతుందనివ్రాశారు. డాక్టర్‌జీ గురూజీకి ఆ ఉత్తరం ఇచ్చి చదవమన్నారు. ఆయా విషయాలపై ఎవరి అభిప్రాయం ఎలా ఉంటుందో తెలుసుకొనడానికి డాక్టర్‌జీ అనుసరించే ప్రత్యేక పద్ధతి అది. మాటలలో చెప్పకుండా వ్యక్తులకు పని చేయాలనే ప్రేరణ ఇవ్వడానికి ఆయన అవలంబించే విధానం అది.

పరస్పర వైమనస్యాలు కారణంగా, వ్యక్తిగత అహంకారం కారణంగా అక్కడి పని నిర్లక్ష్యానికి గురి అవుతున్నదని ఆ ఉత్తరం వల్ల స్పష్టమవుతున్నది. ఆ ఉత్తరం చదివి గురూజీ ఇలా అన్నారు: ''మీరు వెళ్ళమంటే నేను అక్కడికి వెళ్ళి, శాఖను సరిచేయడానికి ప్రయత్నిస్తాను. కాలేజీకి ఇప్పుడు సెలవులు కూడా.''

గురూజీ నోట ఆ మాట విని డాక్టర్‌జీ ఎంతగానో ఆనందించారు. ఆయన వెంటనే గురూజీని బొంబాయి పంపారు. అక్కడకు వెళ్లి ఆయన రాత్రింబవళ్లు శ్రమించారు. స్వయంసేవకులు అందరినీ కలుసుకున్నారు. వారి మధ్య ఉన్న కలతలు తొలగించారు. నీరస భావనను తరిమివేశారు. అక్కడి

శాఖలు చక్కబడ్డాయి. ఆ విధంగా అప్పగించిన పని సక్రమంగా సాధించి, గురూజీ నాగపూరు తిరిగి వచ్చారు.

గురూజీకి ఒక స్నేహితుడు ఉండేవారు. ఆయన పేరు వామనరావ్ వాడేగాంవ్‌కర్. వామనరావు చిన్నతనంలోనే అంధుడైపోయారు. అయితే ఆయన గుణం దొడ్డది. శ్రమించే లక్షణం గొప్పది. ఆయన స్వయంగా అంధ విద్యాలయం నడిపేవారు. అలాంటివారికి సాయపడడం గురూజీ జీవలక్షణం. ఆయన అంధవిద్యాలయం కోసం విరాళాలు సేకరించేవారు. వామనరావును సైకిల్ మీద ఎక్కించుకొని తీసుకువెళ్ళేవారు. ప్రతిరోజూ ఆయనకు ఏదో ఒక గ్రంథం చదివి వినిపించేవారు. విద్యారణ్య స్వామి రచించిన పంచదశి గ్రంథం అతి క్లిష్టమైనది. ఎంతో ప్రసిద్ధి పొందినది. గురూజీ ఆ గ్రంథాన్ని వామనరావుకు చదివి వినిపించారు. దానికి అర్థం చెప్పారు. ఆ గ్రంథంపై వ్రాసి ఉన్న వ్యాఖ్యాన గ్రంథాలు అనేకం వినిపించారు.

ఇన్ని పనులు చేస్తూ కూడా, గురూజీ చదువు గురించి పూర్తి శ్రద్ధ తీసుకునేవారు. చదువుకోసం రోజూ కొద్ది సమయం కేటాయించేవారు. ఏ పుస్తకం అయినా ఒక్కసారి చదివితే చాలు. అది ఆయనకు శాశ్వతంగా గుర్తు ఉండేది ఏది చదివినా అందులో పూర్తిగా లీనమైపోయేవారు.

ఒకరోజున ఆయన రామ్‌టేక్ వెళ్ళాలని బయలుదేరారు. బస్సు ఎక్కారు. చేతిలో న్యాయశాస్త్ర గ్రంథం ఉంది. పుస్తకం తెరచి చదవడం మొదలుపెట్టారు. బస్సు చాలా 'చోట్ల ఆగింది. జనం ఎక్కుతున్నారు. దిగు తున్నారు. బస్సు రామ్‌టేక్ చేరింది. అయినా ఆయన చదువులో మునిగిపోయి ఉన్నారు. బస్సు మళ్లీ నాగపూర్ బయలుదేరుతోంది. ప్రయాణికులు బస్సు ఎక్కుతున్నారు. అప్పుడు కండక్టర్ అడిగాడు - ''మీరు ఎక్కడికి వెళ్ళాలి'' అని. గురూజీ పైకి చూశారు. ఇటూ అటూ చూశారు. అరే, రామ్‌టేక్ వచ్చేసిందే! ఆయన పుస్తకం మూసి బస్సు దిగారు.

1934లో విదర్భలోని అకోలా నగరంలో సంఘశిక్షావర్గ జరిగింది. గురూజీని వర్గకు సర్వాధికారిగా నియమించారు. వర్గలో పాల్గొన్న స్వయంసేవ

కులలో ప్రతి ఒక్కరి గురించీ గురూజీ ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. జబ్బుపడిన స్వయంసేవకులకు స్వయంగా సేవచేశారు.

1935లో గురూజీ న్యాయవాద పరీక్ష ప్యాసయ్యారు. న్యాయవాద వృత్తి ప్రారంభించారు. ఇంటి గోడకు బోర్డు తగిలించారు. కోర్టుకు వెళ్ళసాగారు. కేసులు వాదించసాగారు. అక్కడ ఆయన బుద్ధికుశలత అందరికీ కొట్టొచ్చినట్లు కనిపించింది. మధ్యమధ్యలో తల్లిదండ్రులు పలుమారులు పెళ్లి ప్రస్తావన తేవడం సహజమే. గురూజీ దాన్ని దాటవేసేవారు. అయితే ఒత్తిడి పెరిగేసరికి ఆయన భావుజీతో ఇలా స్పష్టంగా చెప్పారు. ''పెళ్లి చేసుకోవాలనే ఉద్దేశం నాకు ఏమాత్రం లేదు వైవాహిక సుఖాన్ని నేను కోరడం లేదు. నా దృష్టిలో అసలు అది సుఖమే కాదు''

ప్రేమమయి అయిన తల్లికి ఈ విషయంలో ఎంతో కోరిక వుంది. ఎంతో ఆశ ఉంది. ఎన్నో కలలు ఉన్నాయి. అయినా గురూజీ ఆమెకు నచ్చజెప్పారు. ఆమెను ఒప్పించారు. వంశం కొనసాగాలనే వాంఛ సున్నితమైనది. దాన్ని గురించి కూడా గురూజీ తల్లిగారికి ఇలా బోధపరచారు : ''సమాజానికి మంచి జరిగే మాట ఉంటే, దేశ కళ్యాణం జరిగేమాట ఉంటే - మన వంశవృక్షం వంటివి ఎన్ని ఆహుతి అయినా మనం బాధపడకూడదు. యుగం పిలుపు ఇది. ఆ పిలుపును అందుకోవడం నా కర్తవ్యంగా నేను భావిస్తున్నాను. వంశం నశించిపోతున్నదన్న విచారం నాకు ఏ కోశానా లేదు.''

గురూజీ మనస్సు ఆ దిశలో పరుగులు తీస్తోంది. మరోప్రక్క బాహ్య జీవితం యథాప్రకారం సాగిపోతోంది. న్యాయవాది మాధవ సదాశివరావు గోళ్వల్కర్ రోజూ కోర్టుకు వెళుతున్నారు. సావలారామ్‌జీ ఇంటిలో కూర్చొని గానంలో వాద్యాలలో లీనమై, ఆ ఆనందంతో మునిగి తేలుతున్నారు. వాడేంగావ్‌కర్‌జీతో తిరుగుతూ సామాజిక బాధ్యతను నిర్వహిస్తున్నారు. డాక్టర్ హెడ్గేవార్‌జీ వద్దకు వెళ్ళి ఆయనతో జాతీయ సమస్యల గురించి ఆలోచన చేస్తున్నారు.

ఉన్నట్టుండి 1936 అక్టోబరు నెల మూడవ వారంలో ఒక అద్భుత సంఘటన జరిగింది. దీపావళికి ఇంకా ఏడెనిమిది రోజులు ఉంది. మాధవరావ్ మిత్రులలో ఎవరి నోటవిన్నా అదే మాట. ''మాధవరావ్ ఇల్లు వదిలి ఎక్కడికో వెళ్ళిపోయారు.'' ''ఎవ్వరికీ ఏమీ చెప్పలేదు'' ''పాపం ఒక్కగా నొక్కకొడుకు'' ''భావుజీని ఓదార్చడం ఎవరి తరం?'' ''తాయీని ఊరడించడం ఎవరి తరం?'' అందరి మనసులలో ఆందోళన, విచారం, ఆదరభావం కలబోసుకొని వెల్లువలా పెల్లుబుకుతున్నాయి. ఆ వార్త విని భావుజీ, తాయీ దుఃఖంలో మునిగిపోయారు. డాక్టర్ హెడ్గేవార్‌జీ ముఖంలో ఆవేదన కానవచ్చింది.

# 13. సారగాఛీ

కలకత్తాకు ఉత్తరాన 130 మైళ్ళ దూరంలో ముర్షిదాబాద్ జిల్లాలో సారగాఛీ అనే గ్రామం ఉంది. సారగాఛీ అంటే దట్టమైన చెట్ల వరుసలు అని అర్థం. ఆ గ్రామం అలాంటిదే. వనసంపద పుష్కలంగా ఉంది. ధన సంపద మాత్రం పూజ్యం. అక్కడి ప్రజలు నిరుపేదలు. దీనంగా, హీనంగా బ్రతుకులు వెళ్లదీ స్తున్నారు.

1896లో ఒక యువ సన్యాసి అక్కడికి వచ్చాడు. అతని పేరు అఖండానంద. అతడు శ్రీరామకృష్ణ పరమహంస శిష్యుడు. స్వామి వివేకానం దకు గురుభాయి. గంగానది ఒడ్డున యాత్ర చేస్తూ గంగోత్రి చేరాలని అతని ఆలోచన. అక్కడే ఏదైనా అందమైన గుహ చూసుకుని, హిమాలయాలలో ఉండిపోవాలని అతని ఉద్దేశం. అక్కడ ధ్యాన ధారణలతో, జపతపాలతో జీవితం గడపాలని అతని సంకల్పం. ఆ ఆశయంతో కలకత్తానుంచి బయలుదేరాడు. త్రోవలో సారగాఛీ తగిలింది.

ఆ గ్రామంలో ఎక్కడా మంచినీళ్లు లేవు. గ్రామ ప్రజలు ఎంతో దూరం వెళ్ళి నీళ్ళుతెచ్చుకుంటున్నారు. నానాయాతనా పడుతున్నారు. పదేళ్ళ పిల్ల నీళ్ళు

నిండిన కుండ తలమీద పెట్టుకొని ఇంటికి వెళుతోంది కాలికి దెబ్బ తగిలి పడిపోయింది. స్వామీజీ పరుగున వెళ్లి ఆ పిల్లను లేవనెత్తాడు. పిల్లకు గాయం తగలలేదు కానీ, కుండమాత్రం పగిలిపోయింది. ''మా నాన్న నన్ను కొడతాడు. చితకకొడుతాడు'' అంటూ ఆ పిల్ల భోరున ఏడుస్తోంది. స్వామీజీ ఆ పిల్లకు కొత్త కుండ ఇప్పించాడు. ఆ పిల్ల ఏడుపు మానింది. మళ్ళీ నీళ్ళు తేవడానికి వెళ్ళిపోయింది.

ఈ వార్త గ్రామం అంతటా వ్యాపించింది. మన గ్రామానికి ఎవరో దయామయుడు వచ్చాడట. పదండి. ఆ మహాపురుషుని దర్శనం చేసుకుందాం. అంటూ గ్రామ ప్రజలు అఖండానందజీ పాదాలవద్దకు వచ్చి కూర్చున్నారు. స్వామీజీ ఎంతో ప్రేమగా అందరినీ పరిచయం చేసుకున్నారు. వారు తమ కష్టగాథలు వినిపించారు. తమ బాధలు వెళ్ళబోసుకున్నారు. అంతావిని, కరుణామూర్తి అయిన స్వామి అఖండానందజీ గుండె చెరువైపోయింది. దరిద్ర నారాయణుడు ఆయనకు అక్కడ సాక్షాత్కరించాడు. గ్రామ ప్రజల కష్టాలు గట్టెక్కించడానికి ఆయన పథకాలు తయారుచేశాడు. గ్రామ ప్రజలు ఆయన మాట వింటున్నారు. ఆ ప్రకారం నడుచుకుంటున్నారు. అక్కడ అందమైన ఆశ్రమం నిర్మాణమైంది.

రోజూ పడుకోబోయేటప్పుడు అఖండానందజీకి గంగోత్రీ, హిమాలయాలు గుర్తువచ్చేవి. ఈ కాస్తపనీ పూర్తయిన తరువాత ఇక్కడనుంచి వెళ్ళిపోతాను - అని ఆయన తన మనసుకు సమాధానం చెప్పుకునేవారు. తెల్లవారేది. పేదరికంలో, అజ్ఞానంలో, కష్టాల కడలిలో మునిగి ఉన్న ఆ గ్రామ ప్రజలను చూసేసరికి రాత్రిచేసిన ఆలోచనలన్నీ ఎరిగిపోయేవి. గ్రామ ప్రజలకు ఉపయోగపడే పనులలో ఆయన లీనమైపోయేవారు. అలా నెలలు గడిచాయి. సంవత్సరాలు గడిచాయి. ఇదే నా గంగోత్రి. ఇదే నా హిమాలయం. ఈ సోదరుల సేవయే నా ధ్యానం. ఇదే నా తపశ్చర్య. ఇక ఇక్కడే ఉంటాను. వీరికి సేవ చేస్తాను. ఇలా నిర్ణయించుకున్నారు అఖండానందజీ. •

ఆయన తన నిర్ణయాన్ని తెలుపుతూ స్వామి వివేకానందకు ఉత్తరం వ్రాశారు. స్వామి వివేకానంద ఎంతగానో ఆనందించారు. సారగాచీ ఆశ్రమానికి మంచి కార్యకర్తలను ఇద్దరిని పంపారు. తగినంత ధనం కూడా పంపారు అఖండానందజీకి ఇలా ఉత్తరం వ్రాశారు:

''నీవు చేస్తున్న పని వివరాలు అందుతున్నకొద్దీ నా మనస్సు ఆనందంతో మరింతగా నిండిపోతున్నది. ఇలాంటి పనులద్వారా ప్రపంచాన్ని జయించవచ్చు. ఇలాంటి పనులలో కులభేదానికికానీ, మత బేధానికి గానీ తావు లేదు. మీరు ధన్యులు. నేను నీకు కోటి ధన్యవాదాలు చెపుతున్నాను. నిండు మనస్సుతో నీకు ఆశీస్సులు ఇస్తున్నాను.''

అఖండానందజీ ప్రజలకు సేవచేస్తూ తన జీవితమంతా ఇక్కడే గడిపారు. మంచి గంధం తాను మసి అయిపోతుంది. ఇతరులకు శాంతి ఇస్తుంది. తాను మండుతూ ఇతరులకు సువాసనలు విరజిమ్ముతుంది. ఆ మంచి గంధం లాంటిది ఆయన జీవితం. ఆయన పాదాలవద్ద కూర్చొని మోక్షమార్గ పాఠాలు నేర్చుకునేందుకై మాధవరావ్ నాగపూర్ వదిలి సారగాచీ చేరారు. నాగపూరు నుంచి తెచ్చిన పరిచయపత్రాన్ని ఇచ్చి ఆయన పాదాలకు సాష్టాంగ నమస్కారం చేశారు.

# 14. సద్గురువు సేవలో

అఖండానందజీ మాధవరావ్‌ను చేయి పుచ్చుకు లేవదీశారు. తనవద్ద కూర్చోబెట్టుకున్నారు. మాధవరావును ఎన్నో ప్రశ్నలు అడిగారు ఆయన వ్యక్తిగత విషయాలు, కుటుంబ విషయాలను తెలుసుకున్నారు. ''గోళ్‌వల్‌కర్, ఇప్పుడు వచ్చావు నీవు. చాలా ఆలస్యంగా వచ్చావు. నేను బాగా ముసలివాణ్ణి అయిపోయాను. నాకు జబ్బుగా వుంది కూడా. బాగా అలసిపోయాను. నేను నీకు ఎలా దారి చూపగలను?'' అన్నారు.

''స్వామీజీ, మీకు సేవ చేయడానికి నాకు అనుమతి ఇవ్వండి చాలు. మీకు సేవచేస్తూ ఉంటే నాకు అంతా లభిస్తుంది. తగు సమయం చూసి మీరు నన్ను అనుగ్రహించండి. అప్పుడు నేను కృతార్థుడను అవుతాను''- అని మాధవరావ్ జవాబు చెప్పారు.

''సరే నీవు ఇక్కడ ఉండు. ఆ తర్వాత ఠాకూర్ (రామకృష్ణ పరమహంస)ఎలా ప్రేరణ ఇస్తే అలా జరుగుతుంది.''- అని స్వామీజీ సంభాషణ ముగించారు.

స్వామీజీ నోటివెంట ఆ మాటవిని మాధవరావ్ పరమానందం పొందారు. ఆయన ఆ క్షణం నుంచే స్వామీజీ సేవలో నిమగ్నమైనారు. ఆయన స్వామీజీకి పూజా సామగ్రి అమర్చేవారు. భోజనం తయారుచేసేవారు. ఆశ్రమాన్ని చీపురుతో ఊడ్చేవారు. గిన్నెలు తోమేవారు. కట్టెలు కొట్టి తెచ్చి వాటిని చీల్చేవారు. ఇలాంటి పనులన్నీ భక్తి శ్రద్ధలతో చేసేవారు. పగలయినా అర్థరాత్రి అయినా, గురుదేవులు పిలవగానే మాధవరావ్ చేతులు జోడించి ఆయన ఎదుట నిలిచేవారు. స్వామీజీ మాధవరావ్‌ను ఎన్నో విధాల పరీక్షించారు. మాధవరావ్ ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణుడైనారు. స్వామీజీ ప్రసన్నులు అయినారు. మకర సంక్రాంతి పర్వదినాన 1937 జనవరి 13న ఆయన మాధవరావ్‌కు గురుమంత్రం ఉపదేశించారు. ఆ తర్వాత శిష్యుణ్ణి మనసారా ఆశీర్వదిస్తూ ఇలా ఆదేశించారు. ''గోల్‌వల్‌కర్, నీపని హిమాలయాలకు వెళ్ళడంకాదు. గుహలో కూర్చోవడం కాదు. ప్రజల మధ్యకు వెళ్లే పని నీది. అందుకోసం ఒక మహాకార్యం నీకోసం ఎదురుతెన్నులు చూస్తోంది. నా ఆశీస్సు నీకు ఎప్పుడూ ఉంటుంది. నీవు ఎక్కడ అడుగుపెట్టినా, విజయం నిన్ను వెన్నాడుతుంది. నాయనా గోల్‌వల్‌కర్, ఈ గడ్డం, ఈ జడలు నీ ముఖానికి ఎంతోశోభ నిస్తున్నాయి. ఎన్నడూ వీటిని తొలగించవద్దు''

కొద్ది రోజుల తర్వాత అఖండానందజీకి తీవ్రంగా జబ్బు చేసింది. మాధవరావ్ స్వామీజీకి ఎల్లవేళలా శుశ్రూష చేశారు. కలకత్తానుంచి డాక్టర్లు

వచ్చేవారు. మందులు వ్రాసి వెళ్ళేవారు. అయినా జబ్బు నయం కాలేదు. గ్రామంలో ఉంచితే లాభంలేదని స్వామీజీని కలకత్తా తీసుకువెళ్ళారు. స్వామీజీ ఆదేశం ప్రకారం మాధవరావ్ ఆయనతోపాటు కలకత్తా వెళ్ళారు. గురుదేవుని పరిచర్యలో మాధవరావు రాత్రింబవళ్ళు శ్రమించారు. మాధవరావ్ దీక్షాదక్షతలు కారణంగా - స్వామీజీకి వైద్యంలో, పరిచర్యలో లోపం అనేది జరగలేదు

తనకు చివరి రోజు దగ్గరపడిందని స్వామీజీ తెలుసుకున్నారు. ఆయన మాధవరావ్‌ను దగ్గరకు రమ్మన్నారు. కూర్చోబెట్టుకున్నారు. ఆయన తలపై చేయి ఉంచి ఉపదేశం ఇచ్చారు. 1937 ఫిబ్రవరి 7న స్వామీజీ తమ ఇహలోక లీల చాలించారు.

మాధవరావ్ దుఃఖానికి అవధులు లేవు. ఆయన దక్షిణేశ్వర్ వెళ్ళారు. బేలూర్ మఠానికి వెళ్ళారు. కామార్‌పుకుర్, జయరామ్‌బాటీ కూడ వెళ్ళారు. శ్రీరామకృష్ణ పరమహంస, శ్రీశారదామాత, స్వామి వివేకానందుల నివాసం వల్ల పునీతమైన స్థలాలను దర్శించారు. ఆయన సుమారు నెల పదిహేను రోజులు కలకత్తాలో ఉన్నారు. 1937 మార్చి చివరివారంలో నాగపూర్ తిరిగి వచ్చారు.

# 15. డాక్టర్‌జీ సాహచర్యంలో

శ్రీ గురూజీ నాగపూర్ వచ్చారు. స్నేహితులూ, బంధువులూ ఎంతో ఆనందించారు. ఆయన రామ్‌టేక్ వెళ్ళారు. భావుజీ పాదాలకు నమస్కారించారు. భావుజీ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తాయీ ఆయనను చిన్న పిల్లవాడిలా దగ్గర కూర్చోబెట్టుకుని ఆయన ముఖం నిమిరింది. ఆయన కొన్ని రోజుల పాటు రామ్‌టేక్‌లో ఉన్నారు. రోజూ రామాలయానికి వెళ్ళేవారు. ఒంటరిగా పై మెట్టుమీద కూర్చొని ధ్యానంలో మునిగిపోయేవారు. ఒక్కోసారి మధురమైన వేణునాదంతో వాతావరణాన్ని నింపేవారు.

కొద్దిరోజుల తర్వాత ఆయన నాగపూర్ వచ్చారు. అయితే న్యాయవాద వృత్తిలో ఆయనకు ఇప్పుడు ఆసక్తిలేదు. ఆయన తిరిగి వచ్చారనే మాట విని డాక్టర్‌జీకి అపారమైన ఆనందం కలిగింది. ఇప్పుడు ఆయన పనికట్టుకుని గురూజీతో సాన్నిహిత్యం పెంచుకుంటున్నారు. గురూజీ ఒక వార్తాపత్రిక సంపాదకమండలి సభ్యుడు అయినారు ''షికాగో మహాసభలో స్వామి వివేకా నంద ఉపన్యాసం'' అనే ఆంగ్లపుస్తకాన్ని ఆయన మరాఠీలోకి అనువదించారు. ఏపని అయినా ఆయన ఎంతో ఉత్సాహంగా, ఎంతో వేగంగా చేసేవారు. ఆంగ్లభాష ఆయనకు మంచినీళ్ళప్రాయం.

క్రాంతివీర్ బాబారావ్ సావర్కార్‌జీ ''రాష్ట్ర మీమాంస'' అనే మరాఠీ గ్రంథం `రచించారు. ఆ గ్రంథాన్ని ఆంగ్లభాషలోకి అనువాదం చేయించి ప్రచురించాలని నాగపూర్‌లోని న్యాయవాది విశ్వనాథ్‌రావ్ కేల్కార్ సంకల్పిం చారు. ఆయన తన అభిప్రాయం భయ్యాజీ దాణీకి తెలియజేశారు

''శ్రీ మాధవ్‌రావ్ గోళ్వల్కార్ ఈపని చక్కగా చేయగలరు. నేను ఆయనను అడిగి చూస్తాను'' అని భయ్యాజీ ఆయనతో చెప్పారు.

అనువాదం చేయడానికి గురూజీ ఒప్పుకున్నారు. ఆయన కేల్కార్‌జీ ఇంటినుంచి ఆ పుస్తకం , తెల్లకాగితాలు తెచ్చుకున్నారు. మరునాడే ఆయన అక్కడికి తిరిగి వెళ్ళారు. ఆయన చేతిలో ఆ పుస్తకమూ, కాగితాలూ ఉన్నాయి. ఆయన అలా రావటం చూసి ''నాకిప్పుడు తీరిక లేదండి... అనువాదం చేయడం చాలా కష్టమండి'' వంటి మాటలు వినవలసి వస్తుందని కేల్కార్‌జీ అనుకున్నారు. కానీ, పూర్తి అనువాదం చేతిలో పెట్టేసరికి , ఆయన ఆశ్చర్యానికి అవధిలేకపోయింది. ఆయన అనువాదం అక్కడక్కడ చదివి చూశారు. ఆంగ్లపదాల ఎన్నిక, వాక్యరచన, విషయాన్ని ప్రతిపాదించే శైలి, భావాలను వ్యక్తం చేసిన తీరు మొదలైన అన్ని విషయాలలో అనువాదం అత్యుత్తమంగా వుంది. మాధవరావ్‌ను ముక్తకంఠంతో ప్రశంసిస్తూ ఆయన భయ్యాజీ దాణీతో ''మీ స్నేహితుడు ఒక నరరత్నం'' అన్నారు.

కొద్దిరోజుల తర్వాత శ్రీ గురూజీ ఆ విషయంపై ''వుయ్ అండ్ అవర్ నేషన్‌హుడ్ డిఫైన్డ్'' అనే స్వతంత్ర గ్రంథాన్ని ఆంగ్లంలో రచించారు.

ఈ కాలంలో డాక్టర్‌జీ గురూజీ విషయంలో ఎంతో శ్రద్ధ తీసుకున్నారు. గురూజీ గుణాలను, కర్తృత్వాన్నీ ఆయన సూక్ష్మంగా పరీక్షిస్తున్నారు. డాక్టర్‌జీ ఆదేశాలను గురూజీ అక్షరాలా పాటించేవారు ఆయన రోజూ శాఖకు వెళ్ళేవారు. స్వయంసేవకుల సమావేశాలు తీసుకునేవారు. బౌద్ధిక్ వర్గలో ప్రసంగించేవారు.

ఒక సమావేశంలో యాభైమంది స్వయంసేవకులు పాల్గొన్నారు. సంఘపద్ధతి ప్రకారం ప్రతి ఒక్కరు తమను పరిచయం చేసుకున్నారు. పేరు, శాఖలో బాధ్యత, వృత్తి మొదలైన వివరాలు చెప్పారు. ''గురూజీ , వీరంతా మన ప్రముఖ కార్యకర్తలు. వీరి పరిచయం గుర్తుంచుకోండి'' అని డాక్టర్‌జీ అన్నారు. ''వీరిని నేను మరచిపోలేను'' అని గురూజీ సమాధానం చెప్పారు. ఒక్కొక్కరి పూర్తి పరిచయం తాను వినిపించసాగారు. ఎక్కడా పొరపాటురాలేదు. పద్ధతి ప్రకారం పొల్లుపోకుండా అంతా వినిపించారు. అద్భుతమైన ఆ స్మరణశక్తి చూసి అంతా చకితులైనారు. డాక్టర్‌జీ ఎంతో ఆనందించారు. ఎందుకంటే, ఆయన మరో సంగతి కూడా గుర్తించారు. అది వట్టి స్మరణశక్తి ప్రదర్శనకాదు, అందులో ఆత్మీయత వుంది. అందులో ఏకాత్మత ఉంది. ఆ నమ్మకం. కుదరడంతో డాక్టర్‌జీకి అపారమైన ఆనందం కలిగింది. ఆయన గురూజీకి మరింత ముఖ్యమైన పనులు అప్పగించసాగారు. ఆయన ఒక్కోసారి గురూజీని హిందీలో మాట్లాడమనేవారు. ఒక్కోసారి ఇంగ్లీషులో మాట్లాడమనేవారు. గంగా ప్రవాహంలాంటి ఆయన వక్తృత్వం ప్రభావం శ్రోతల ముఖాలపై కానవచ్చేసరికి, డాక్టర్‌జీ సంతోషంతో పులకించి పోయేవారు.

గురూజీ వక్తృత్వ చాతుర్యాన్ని కానీ, వ్యవహార కౌశల్యాన్ని కానీ ఎవరైనా ప్రశంసిస్తూ ఉంటే, డాక్టర్‌జీ ఆ మాటలు శ్రద్ధగా వినేవారు, సంతోషించేవారు.

ఆ తర్వాత రకరకాల ప్రశ్నలు వేసేవారు గురూజీ గురించి మీ అభిప్రాయం ఏమిటి అని తన పాత సహచరులను అడిగేవారు

రెండవపైపు నుంచి కూడా ఈ ప్రక్రియ సాగుతున్నది. గురూజీ కూడా డాక్టర్‌జీని పరీక్షిస్తున్నారు. దూరపు కొండలు నునుపు అనే సామెత ఎందరో నాయకులకు వర్తిస్తుంది. అయితే డాక్టర్‌జీ జీవితం అందుకు పూర్తిగా విరుద్ధం. దూరం నుంచి ఆయన మామూలు మనిషిలా కనిపిస్తారు. సూక్ష్మంగా పరిశీలించిన మీదట గురూజీకి ఒక సంగతి అర్థమయింది. డాక్టర్‌జీ మామూలు దుస్తులలో ఉన్న అఖండానందజీయే. అలాంటి ధీరగంభీర ప్రవృత్తి, అలాంటి శాంత స్వభావం డాక్టర్‌జీకి ఉంది. అలాంటి కర్మయోగమే డాక్టర్‌జీలో ఉంది. కీర్తిపట్ల అదే వైముఖ్యం'' మానవకళ్యాణం ద్వారా ఈశ్వర సేవ చేయాలనే అదే వ్రతం. ధ్యేయాన్ని గురించి నిరంతరం అదే చింతన తనువుతో, మాటతో, మనసుతో, మంచిగంధంలా అనుదినం, అనుక్షణం ఆయుర్దాయాన్ని కరిగిస్తూ ఉండటం, వెలిగిస్తూ ఉండటం, దుస్తులు మాత్రం సన్యాసి ధరించే దుస్తులు కావు. ఇతర విషయాలు అన్నిటిలో డాక్టర్‌జీ సర్వసంగ పరిత్యాగియే.

గురూజీ ఆధునిక విద్య అభ్యసించిన వ్యక్తి. ఉన్నత విద్య అభ్యసించిన వ్యక్తి. విజ్ఞానశాస్త్రంలో, న్యాయశాస్త్రంలో పట్టం పుచ్చుకున్న విద్యాధికుడు. ప్రాచ్య పాశ్చాత్య తత్వశాస్త్రాలను తులనాత్మకంగా అధ్యయనం చేసిన వేత్త. అందువల్ల అన్వేషణ ఆయన స్వభావం. ఏ విషయాన్ని అయినా క్షణాలమీద గ్రహించే ప్రతిభ ఆయన సొత్తు. ఆయన వివిధ విషయాలపై డాక్టర్‌జీని ఎన్నో ప్రశ్నలు అడిగారు. డాక్టర్‌జీ శాంతంగా. స్పష్టంగా ప్రశ్నలు అన్నింటికీ సమాధా నాలు చెప్పారు. సంఘ స్వరూపాన్ని బోధపరిచారు. ఆయన డాక్టర్‌జీని అన్ని కోణాలనుంచీ చూశారు. పరీక్షించారు. డాక్టర్‌జీ భావాలు స్పష్టమైనవి. ఆయన శీలం నిష్కళంకమైనది. ఆయన త్యాగం జాజ్వల్యమానమైనది. గురూజీ ఆయ నకు అనుచరుడు అయినారు. పరమభక్తుడు అయినారు.

# 16. కలసిన మనసులు

1938 మే, జూన్ నెలలో నాగపూర్‌లో సంఘశిక్షావర్గ జరిగింది. వర్గ సర్వాధికారి గురూజీ. ఆయన వర్గకు వచ్చిన స్వయంసేవకులను అందరినీ వ్యక్తిగతంగా పరిచయం చేసుకున్నారు. వర్గలో ప్రతి స్వయంసేవక్‌కూ సౌకర్యంగా ఉన్నదో లేదో ఆయన స్వయంగా తెలుసుకునేవారు. శారీరిక కార్యక్రమాలు, భోజన వ్యవస్థ, వైద్యవిభాగం, పారిశుధ్య విభాగం వంటి వివిధ విభాగాలు సక్రమంగా పనిచేస్తున్నాయో లేదో ఎప్పటికప్పుడు వివరంగా పరీక్షించేవారు ఎవరైనా కార్యకర్త పొరపాటు చేస్తే, అశ్రద్ధ చేస్తే అతడికి ఆ పని ఎలా చేయాలో వివరించేవారు. అర్ధరాత్రి వంటశాలకు తప్పకుండా వెళ్ళేవారు. మిగిలిన అన్నంమీద మూత సరిగా ఉందో లేదో చూసి వచ్చేవారు. అలాగే, అంతా సరిగా నిద్రపోతున్నారో లేదో, రక్షకులు పహరా ఇచ్చేపని సక్రమంగా చేస్తున్నారో లేదో రోజూ పరిశీలించి వచ్చేవారు.

వర్గ పూర్తయిన తర్వాత గురూజీ డాక్టర్‌జీతో పాటు పూనా వెళ్ళారు. అక్కడ ''భగవా ఝుండా'' అనే మరాఠీ చలనచిత్రానికి డాక్టర్జీ ప్రారంభోత్సవం చేశారు. ఆ ఉత్సవంలో గురూజీ పాల్గొన్నారు.

కొద్ది నెలలుగా డాక్టర్‌జీకి తరచుగా జబ్బు చేస్తోంది. ఆయన తన జబ్బు గురించీ, దానివల్ల కలిగే బాధ గురించీ ఎప్పుడూ ఎవరికీ చెప్పేవారు కారు. జ్వరం వచ్చినా విరామం లేకుండా శ్రమించేవారు. కొద్ది రోజులు దేవలాలీలో విశ్రాంతి తీసుకోవలసిందిగా ప్రముఖ కార్యకర్తలు పలువురు డాక్టర్‌జీని ఒత్తిడి చేశారు. గురూజీ వారిమాట బలపరచారు. డాక్టర్‌జీ అందుకు ఒప్పుకున్నారు.

దేవలాలీ మహారాష్ట్రలో నాసిక్ సమీపాన ఉంది. అక్కడి నీరు, అక్కడి శీతోష్ణ పరిస్థితి ఆరోగ్యానికి మంచిది. గురూజీని వెంట తీసుకొని డాక్టర్‌జీ అక్కడికి వెళ్ళారు. స్వయంసేవకులు అక్కడ చక్కని ఏర్పాట్లు చేశారు కానీ, కొద్దిరోజుల తర్వాత డాక్టర్‌జీకి తీవ్రంగా జబ్బు చేసింది. వైద్యం కోసం ఆయనను నాసిక్ తీసుకువెళ్ళారు. శిక్షణ పొంది అనుభవం గడించిన నర్సులా, అణకువ,

శ్రద్ధ కలిగిన శిష్యునిలా - గురూజీ డాక్టర్జీకి రేయింబవళ్ళు సేవ చేశారు. వేళకు మందు ఇవ్వడం, పథ్య భోజనం తినిపించడం, వీపుకు నూనె మర్దనా చేయడం, ముఖం కడిగించడం, బట్టలు మార్చడం, బట్టలు ఉతకడం వంటి పనుల ఏర్పాటు గురూజీ స్వయంగా చూసుకునేవారు. గురూజీ సేవా భావాన్నీ, శ్రద్ధనూ చూసి డాక్టర్‌జీ ఎంతగానో ఆనందించారు. డాక్టర్‌జీ మనోనిగ్రహం, అచంచలమైన ఆయన ధ్యేయనిష్ఠ చూసి గురూజీ ప్రభావితులు అయినారు. డాక్టర్‌జీని నిద్రలో కూడా సంఘకార్యం గురించిన ఆలోచనే వెన్నాడేది. అంతటి జబ్బులో కూడా ఆయనకు దేశహితమే కళ్ళఎదుట మెదిలేది. క్రమక్రమంగా గురూజీ తన జీవితాన్ని ఆ మహాపురుషుని చేతుల్లో పెట్టారు. డాక్టర్జీ కూడా మనసులో నిశ్చయం చేసుకున్నారు. నా ఆత్మను, నా ప్రాణాన్ని, ప్రాణప్రదమైన నా సంఘకార్యాన్ని ఈ తేజోమూర్తికి అప్పగించాలి - అని.

రెండు నెలలు గడిచాయి. ఆరోగ్యం కుదుటపడిన తర్వాత డాక్టర్‌జీ నాగపూర్ తిరిగివచ్చారు. అప్పుడు ఆయన ఒకసారి కృష్ణరావ్ మొహరీర్‌తో ఇలా అన్నారు''కృష్ణా, నాసిక్‌లో నేను జబ్బుపడి ఉన్న సమయం వృధా అయిందని అనుకోకు. ఎంతమాత్రం వృధా కాలేదు. గురూజీ రూపంలో సంఘానికి ఎంతో గొప్ప వరం లభించింది.''

1939 ఆగస్టు నెలలో నాగపూర్ శాఖ శ్రీ గురుదక్షిణ - రక్షాబంధన్ ఉత్సవం జరిగింది. ఆ సందర్భంగా డాక్టర్‌జీ అతిముఖ్యమైన ప్రకటన చేశారు - ''మనందరికీ చిరపరిచితులు శ్రీ మాధవరావ్ గోళ్వల్కర్ (ఆయనను మనం గురూజీ అనిపిలుస్తాం) నేటినుంచి రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్ యొక్క అఖిల భారతీయ సరకార్యవాహగా బాధ్యత నిర్వహిస్తారు.''

1939 ఫిబ్రవరి నెల చివరివారంలో నాగపూరు, వార్ధాల మధ్య ఉన్న సింధీ అనే స్థలంలో డాక్టర్‌జీ అతిముఖ్యమైన సమావేశం ఏర్పాటు చేశారు. శ్రీగురూజీ, అప్పాజీ జోషి, బాలాసాహెబ్ దేవరస్, తాత్యారావ్ తెలంగ్, విట్ఠల్ రావ్ పతకీ, నానాసాహెబ్ టాలాటులే, కృష్ణరావ్ మొహరీల్ వంటి ప్రముఖ

కార్యకర్తలు ఆ సమావేశంలో పాల్గొన్నారు. వారంతా ప్రతిరోజూ ఎనిమిది గంటలపాటు కలిసి కూర్చొనేవారు. సంఘ కార్యానికి సంబంధించిన అన్ని విషయాలను కూలంకషంగా చర్చించేవారు. ఆ చర్చ పదిరోజులు సాగింది. నియమావళి, సంఘస్థాన్ ఆజ్ఞలు, కార్యపద్ధతి, ప్రతిజ్ఞ, ప్రార్థన మొదలైన అంశాలపై విస్తృతంగా చర్చ జరిగింది. ముఖ్యమైన నిర్ణయాలు తీసుకున్నారు.

ఆ సమావేశం తర్వాత డాక్టర్‌జీ గురూజీని కలకత్తా పంపారు. చైతన్యం, ప్రగతి వెల్లివిరిసే ప్రాంతంగా బెంగాల్ పేరుపొందింది. డాక్టర్‌జీ సంవత్సరాల తరబడి బెంగాల్‌లో ఉన్నారు. ఆ ప్రాంతంపట్ల ఆయనకు అభిమానం ఉంది. అయితే అక్కడ పనిచేయటం కష్టం అని కూడా ఆయనకు తెలుసు. తీవ్ర భావాలు కలిగిన విప్లవాదుల చరిత్ర, సామ్యవాద ప్రభావం, మూఢాచారాలతో గుడ్డినమ్మకాలతో మునిగిఉన్న సామాన్య ప్రజలు, బెంగాలీలకు తమ ప్రాంతంపట్ల, భాషపట్ల ఉన్న అపరిమితమైన అభిమానం, హిందూ సమాజం అంతటా ఉన్న దోషాలు - ఇవన్నీ ఉన్నప్పటికీ, అక్కడ సంఘ కార్యాన్ని నిర్మించవలసి వుంది. ప్రతిభగల కార్యకర్త మాత్రమే ఆ పని చేయగలడు. అందువల్ల గురూజీని అక్కడకు పంపారు.

గురూజీ కలకత్తాలో నిర్విరామంగా శ్రమించారు. ఆయన రాత్రింబవళ్లు పురప్రముఖులను కలుసుకునేవారు. వారికి సంఘాన్ని గురించి తెలియ జెప్పేవారు. అలాగే, బాలురను, యువకులను ఆటలకోసం కలిపేపని కూడా ప్రారంభించారు. క్రమంగా ఆయన ప్రయత్నం ఫలించింది. 1939మార్చి 22న ఉగాదినాడు కలకత్తాలో సంఘశాఖ ప్రారంభమైంది. ఆయన అక్కడి నుండి తరుణ స్వయంసేవకులను సంఘశిక్షావర్గ కోసం నాగపూర్ తీసుకువచ్చారు. ఆసంవత్సరం కూడా ఆయన వర్గకు సర్వాధికారిగా ఉన్నారు. వర్గ విజయ వంతంగా ముగిసింది.

ఆ తర్వాత ఆయన డాక్టర్‌జీతోపాటు దేశం అంతటా పర్యటన సాగించారు. స్వయంసేవకులను ఉద్దేశించి ప్రసంగించవలసిందిగా డాక్టర్‌జీ

ఆయననే కోరేవారు ఆయన మాట్లాడే పద్ధతి, విషయాన్ని ప్రతిపాదించేతీరు, ఉదాహరణలు చూపడంలో ఆయన నేర్పు - అన్నింటినీ డాక్టర్‌జీ ఎంతో శ్రద్ధగా పరిశీలించేవారు. ఆయనను సరకార్యవాహగా నియమించిన తర్వాత డాక్టర్‌జీయే స్వయంగా ఆయన పర్యటన కార్యక్రమాన్ని తయారుచేశారు. ఆయనను ప్రతి ప్రాంతంలో ఉన్న ప్రముఖ నగరాలకు పంపారు. 1940లో జరిగిన సంఘశిక్షావర్గకు కూడా గురూజీ సర్వాధికారిగా ఉన్నారు.

పూనాలో కూడా సంఘశిక్షావర్గ జరిగేది. డాక్టర్‌జీ ప్రతి సంవత్సరం ఆ వర్గలో 15-20 రోజులు ఉండేవారు ఆరోగ్యం సరిగా లేకపోయినప్పటికీ, ఆయన వర్గలోని స్వయంసేవకులను అందరినీ పరిచయం చేసుకున్నారు. వారికి మార్గదర్శనం చేశారు. వర్గలో కార్యక్రమాలన్నీ క్రమబద్ధంగా జరిగాయి.

ఆ తర్వాత నాగపూరు శిక్షావర్గలో పాల్గొనడానికై డాక్టర్‌జీ 1940 మే 16న అక్కడికి వచ్చారు. అయితే ఆయన ఆరోగ్యం బాగా చెడిపోయింది. వర్గలో ఆయన కార్యక్రమం ఏదీ జరగటానికి వీలులేకపోయింది. ఆయన వర్గలోని స్వయంసేవకులను కూడా కలుసుకోలేకపోయారు. ప్రతిరోజూ ఉదయం, సాయంత్రం గురూజీ ఆయన వద్దకు వెళ్ళేవారు. ఆయనకు మందులు ఇచ్చే ఏర్పాటు చూసేవారు. శిక్షావర్గ కార్యక్రమాలు అన్నింటినీ ఆయనకు నివేదించేవారు. అక్కడి స్వయంసేవకులను కలుసుకోవాలనే కోరికను డాక్టర్‌జీ పదేపదే వ్యక్తం చేశారు. అయితే ఆయన జబ్బు బాగా ముదిరిపోయింది. నాలుగు అడుగులు వేయడానికీ, లేచి కూర్చొనడానికీ కూడా ఆయనకు ఓపిక లేదు. అయినా స్వయంసేవకులను కలుసుకోవాలని ఆయన పట్టుపట్టారు. గురూజీ సహచరులతో సంప్రదించారు. వర్గ ముగింపు ఉత్సవం జరిగిన తర్వాత స్వయంసేవకులకు వీడ్కోలు చెప్పేందుకు జరిగే ప్రత్యేక కార్యక్రమానికి డాక్టర్‌జీని తీసుకువెళ్ళారు. ఆ సందర్భంగా 1949 జూన్ 9 న ఉదయం ఆయన స్వయంసేవకులకు మార్గదర్శనం చేశారు. అదే ఆయన అంతిమ సందేశం అయింది.

గురూజీ, ఇతర కార్యకర్తలూ విశ్వప్రయత్నం చేశారు. నాగపూరులోని వైద్య నిపుణులను పిలిపించారు. వారిసూచనల ప్రకారం మందులు ఇచ్చారు. అయినా డాక్టర్‌జీ ఆరోగ్యం రోజురోజుకూ మరింతగా దిగజారిపోతూ వచ్చింది. చివరికి డాక్టర్ల బృందం లంబర్ పంచర్ చేయాలని, అంటే వెన్నెముకలో సూది గ్రుచ్చి నీరు తొలగించాలని, నిర్ణయించారు. ఆ సంగతి డాక్టర్‌జీకి తెలిసింది. ఆయన గురూజీని, ఇతర ప్రముఖ కార్యకర్తలను దగ్గరకు పిలిపించారు. నా శరీరం మీద ఇప్పుడు చివరి ప్రయోగం జరుగుతోంది. ఫలితం ఎలా ఉంటుందో చెప్పలేము'' అన్నారు. తర్వాత గురూజీని ఉద్దేశించి ఇలా అన్నారు. ''ఇకముందు సంఘకార్యం భారమంతా మీరే వహించాలి. అందుకు మీరు అంగీకరించండి. ఈ శరీరాన్ని గురించి నాకు విచారం లేదు. ఇక లంబర్ పంచర్ చేయించవచ్చు.''

డాక్టర్‌జీ మనకు శాశ్వతంగా వీడ్కోలు చెపుతున్నారా? ఆయన ఈలోకాన్ని విడిచి వెళ్ళిపోతున్నారా? ఆ ఆలోచనే గురూజీకి దుర్భరం అయింది. ఎలాగో తనను తాను సంభాళించుకుని, ''డాక్టర్‌జీ, మీరలా ఎందుకంటారు? మీ ఆరోగ్యం త్వరలో కుదుటపడుతుంది. అపుడు మేమంతా మునుపటివలె పని చేస్తాం'' అని చెప్పారు.

''నేను చెప్పినమాట గుర్తుంచుకోండి. అంతవరకూ చేయండి'' అని డాక్టర్‌జీ సమాధానం చెప్పారు.

లంబర్ పంచర్ జరిగింది. అయినా ఏమాత్రం ప్రయోజనం లేక పోయింది. డాక్టర్‌జీకి స్పృహ తప్పిపోయింది. మళ్లీ తెలివి రాలేదు. 1940 జూన్ 21 శుక్రవారం ఉదయం 9 గంటల 27 నిమిషాలకు డాక్టర్‌జీ ప్రాణవాయువులు అనంతవాయువులో లీనమైనాయి. రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ నిర్మాత, ఆద్యసరసంఘచాలక్ ఇకలేరు. స్వయంసేవకుల ఆదర్శం, స్వయంసేవకుల ప్రియతమ నాయకుడు పరలోకానికి వెళ్ళిపోయాడు. స్వయంసేవకులు, కార్య కర్తలు అంతా దుఃఖ సముద్రంలో మునిగిపోయారు. శ్రీ గురూజీ అందరి కన్నీళ్ళూ తుడిచారు. అందరినీ కార్యోన్ముఖులను చేశారు.

# 17. దేశ పర్యటన

రేషిమ్‌బాగ్ సంఘస్థాన్ డాక్టర్‌జీకి ఎంతో ప్రియమైన కర్మభూమి. ఆ సంఘస్థాన్‌లో 1940 జులై 3 సాయంత్రం శ్రీ గురూజీ సర్‌సంఘచాలక్ ప్రణామ్ స్వీకరించారు. ఆ రోజున ఆయన చేసిన ప్రసంగం స్వయంసేవకులకు ఎంతో ప్రేరణ ఇచ్చింది. జూలై 21న మాసిక శ్రాద్ధ దినం జరిపారు. ఆ రోజున చేసిన ప్రసంగంలో గురూజీ సంఘంపై వస్తున్న విమర్శలు అన్నింటికీ జవాబు చెప్పారు. చివరలో స్వయంసేవక బంధువులకు ఇలా కర్తవ్యాన్ని నిర్దేశించారు. ''ఎలాంటి క్లిష్టపరిస్థితులైనా రావచ్చు. అయినా మనం అడుగు వెనకకు వేయం. అడుగు ప్రక్కకు వేయం. మనం పట్టుదలతో సంఘకార్యంలో నిమగ్నం కావాలి. రెట్టింపు వేగంతో కార్యాన్ని పెంచాలి. విమర్శలు అన్నింటికీ సరైన సమాధానం అదే.''

సరసంఘచాలక్‌గా గురూజీ పర్యటన ప్రారంభమైంది. ప్రతి ప్రాంతం లోనూ ప్రముఖ నగరాలను ఆయన దర్శించారు. అక్కడ ఉన్న శాఖలకు వెళ్ళారు. అక్కడి స్వయంసేవకులను కలుసుకున్నారు. కార్యకర్తలను కలుసు కున్నారు. ''మనం మొదట స్వయంసేవకులం. జాతికి సేవచేయడమే మన కున్న హక్కు. అదే మనపని. దేశధర్మాల కోసం మనం మన సర్వస్వాన్నీ బలి దానం చేయాలి. ప్రతిరోజూ కణకణంగా మనం మన జీవితాన్ని రాష్ట్ర దేవత చరణాలవద్ద సమర్పించాలి. ఈ ధ్యేయనిష్ఠను మనం గ్రామ గ్రామానికీ అందించాలి. ఆబాల గోపాలంలో ఈ ధ్యేయనిష్ఠను నిర్మాణం చేయాలి'' అని ఉద్బోధించారు.

సంఘం యొక్క ఈ మూల సిద్ధాంతాన్ని గురూజీ తన తొలి దేశ పర్యటనలో స్వయంసేవకులు అందరికీ తెలియజెప్పారు. ఇలా 1940లో ప్రారంభమైన ఆయన దేశపర్యటన 33 సంవత్సరాలపాటు నిరంతరంగా సాగింది. కాలినడకన, సైకిల్‌మీద, బస్సులో, రైలుమీద, టాంగాలో కూర్చుని,

విమానంలో , నావలో కూర్చుని - వివిధ వాహనాలు వాడుతూ ,ఆయన లక్షలాది మైళ్లు యాత్ర జరిపారు. ఇంతగా దేశపర్యటన జరిపినవారు అరుదు. ప్రతి ప్రాంతంలోని ప్రముఖ స్థలాలకూ ఆయన సంవత్సరానికి కనీసం రెండు సార్లు తప్పకుండా వెళ్ళేవారు. ఆయన పెద్ద నగరాలకు వెళ్ళేవారు. మారుమూల పల్లెపల్లెలకు వెళ్ళేవారు. ఆయన పెద్దలతో పెద్ద పెద్ద విషయాలు మాట్లాడేవారు. విద్యాధికులతో వారి స్థాయిలో సిద్ధాంత చర్చ జరిపే వారు. బాలురకు కథలూ గాథలూ వినిపించేవారు. పల్లెలలో ఉండే చదువురాని రైతులకు మామూలు మాటలతో విషయాన్ని వివరించేవారు. అందరికీ సంఘకార్యం ఎంత ప్రముఖమైనదో బోధపరచేవారు.

ప్రతి స్థలంలో ప్రముఖ కార్యకర్తలను ఆయన తప్పకుండా కలుసు కునేవారు. వారితో వ్యక్తిగత సంబంధం ఏర్పరచుకునేవారు. సమావేశాలలో అందరినీ పరిచయం చేసుకునేవారు. ఆ పరిచయం గుర్తుంచుకునేవారు. ఎంతో ఆత్మీయతతో ప్రతి ఒక్కరి యోగక్షేమాలూ కనుక్కునేవారు. వ్యక్తిగతమైన ఇబ్బందులనూ, పనిచేయడంలో ఎదురయ్యే సమస్యలనూ తెలుసుకునేవారు. ఆయా చిక్కుముడులు విప్పేవారు. సంఘం పనికి మరింతగా సమయం కేటా యించడానికై కొత్త స్వయంసేవకులకూ, పాతస్వయంసేవకులకూ, ప్రేరణ ఇచ్చేవారు. కొత్త స్థలాలకు సమర్థులైన కార్యకర్తలను పంపి సంఘకార్య విస్తరణ జరిపించేవారు. ఆయన స్వయంగా కొత్త స్థలాలకు వెళ్ళేవారు. ప్రముఖులు, పెద్దల సమావేశాలు నిర్వహించేవారు. వారికి సంఘ సిద్ధాంతాన్ని పెరుకపరచే వారు. వారిలో యోగ్యులైన వ్యక్తులకు ప్రతిజ్ఞ ఇప్పించేవారు. సంఘకార్యం ప్రతి ప్రాంతంలో, ప్రతి జిల్లాలో, గ్రామగ్రామాన పెరగాలి అనేదే ఆయన తపన. ఆ ఆకాంక్ష ఫలించడానికై ఆయన నిరంతరం శ్రమించారు. ఆయన ఎన్నడూ అలసి పోలేదు. ఎన్నడూ ఆగిపోలేదు. శరీరానికి వచ్చే జబ్బులు ఎన్నడూ లెక్కచేయ లేదు. సూర్యునివలె నిత్యం జ్వలిస్తూ ఉండేవారు. నిత్యం వెలుగులు విరజిమ్మే వారు. విరామమన్నది లేకుండా అందరికీ మార్గదర్శనం చేస్తూఉండేవారు.

1939లో ప్రపంచ యుద్ధపు కారుమబ్బులు క్రమ్ముకుంటున్నాయి అపుడు భారతదేశాన్ని ఆంగ్లేయులు పాలిస్తున్నారు దొంగను తేలు కుట్టింది. ఆంగ్లేయుల భయం అదే. వారు మరింతగా జాగ్రత్త వహించారు. కళ్ళలో వత్తులు వేసుకుని చూస్తూ ఉండేవారు. మనపైన ఏదైనా కుట్ర జరగటంలేదుకదా? దేశమంతా ఒక్కసారి భగ్గుమనదుకదా? అనే భయం వారిని పట్టిపీడించేది. అందువల్ల వారు దేశంలో దమనకాండ సాగించారు.

ఆ దెబ్బ సంఘానికి తగిలింది ఆంగ్లపాలకులు సంఘ స్వయంసేవకులను పలువురిని పట్టుకుని జైళ్ళలో కుక్కారు. నానాయాతనలకూ గురిచేశారు. సంఘ కార్యక్రమాలపై కూడా రకరకాల ఆంక్షలు విధించారు. సంఘం తన గణవేషలో మార్పు చేయవలసి వచ్చింది. సంఘంలో సైనిక శిక్షణ ఇచ్చేవారు. దానిని పరిమితం చేయవలసి వచ్చింది.

1942 ఆగస్టు నెలలో మహాత్మాగాంధీ ''క్విట్ ఇండియా ఉద్యమాన్ని ప్రారంభించారు. దేశమంతటా ఆందోళన సాగింది. దేశభక్తి గురించి కొందరి మనసులలో విచిత్రమైన అభిప్రాయాలు ప్రవేశించాయి. పేరు పొందిన నాయకులు సైతం ఆంగ్లేయుల జిత్తులలో చిక్కుకున్నారు. అందువల్ల వారు సంఘంపై రకరకాల ఆరోపణలు చేయసాగారు. పలువురు అకారణంగా సంఘంపై వ్యతిరేకత పెంచుకున్నారు. నలువైపులా పెనుతుఫాను ముంచుకు వస్తున్నది. సముద్ర కెరటాలు పర్వతాలలా ఎగసి ఎగసి పడుతున్నాయి. పెద్ద పెద్ద సంస్థలు ఊగిసలాడసాగాయి. అయితే పరమేశ్వరుని కృపవల్ల సంఘానికి ఒక గొప్ప కర్ణధారి లభించారు. అంతటి భీషణ పరిస్థితిలో సైతం గురూజీ నిబ్బరంగా నిలబడ్డారు. ఎంతో నేర్పుతో సంఘనౌకను నడిపి ముందుకు తీసుకు వెళ్ళారు. ఆ నౌక ఊబిలో చిక్కుకోనూ లేదు. కొండను ఢీకొననూ లేదు.

దేశవ్యాప్తంగా విజృంభించిన ఆ రాజకీయ ఆందోళనలో సంఘ స్వయంసేవకులు పలువురు ఆవేశంగా పాల్గొన్నారు. ఆ దేశభక్తి వెల్లువకు ఒక స్థిరమైన రూపాన్ని, ఒక నిర్మాణాత్మకమైన రూపాన్ని ఇవ్వాలని గురూజీ సంకల్పించారు.

దేశంకోసం ఇల్లూ వాకిలీ వదిలిపెట్టి సంఘప్రచారకులుగా రావడానికి ఆయన ఎందరెందరో యువకులకు ప్రేరణ ఇచ్చారు.

# 18. అభినవ అభిమన్యులు

ఉన్నత విద్య అభ్యసించి డిగ్రీలు తెచ్చుకున్న నవయువకులు పలువురు సంఘకార్యం చేయడంకోసం ఇళ్ళనుంచి బయలుదేరారు. వారు సంసార సుఖాలకు నీళ్ళు వదలుకున్నారు. స్వార్థానికి స్వస్తి చెప్పారు. వారిని సుదూర ప్రాంతాలకు, జిల్లాలకు, గ్రామాలకు పంపారు గురూజీ. ఆయన తన పర్యటన వేగాన్ని కూడా పెంచారు. తుఫానులూ, ఉప్పెనలూ వచ్చినా, కుండపోతగా వర్షం కురుస్తున్నా, వరదలు ముంచుకు వచ్చినా, మరో వైపరీత్యం ఎదురైనా - ఆయన పర్యటన ఆగేది కాదు. తీవ్రమైన జ్వరం వచ్చినా నిర్ణీతమైన తన కార్యక్రమాన్ని మార్చనిచ్చేవారు కాదు ఆయన.

అది యుద్ధ సమయం. బెంగాల్‌లో ఆయన పర్యటన కార్యక్రమం ఏర్పాటు చేశారు. జపానువారి దాడులవల్ల బెంగాల్ అంతటా భయంతో కూడిన వాతావరణం ఆవరించి ఉంది. జనం ఇళ్ళూ వాకిళ్ళూ వదిలి పారిపోతున్నారు. అలాంటి పరిస్థితిలో గురూజీ పర్యటన కార్యక్రమాన్ని రద్దు చేయడం మంచి దని అక్కడి కార్యకర్తలు అనుకున్నారు. ''పరిస్థితి అసాధారణంగా, అస్థిరంగా ఉంది. శ్రీ గురూజీకి ఏదైనా ప్రమాదం జరిగితే?'' అందువల్ల పర్యటన కార్యక్రమాన్ని రద్దుచేస్తే మంచిదని గురూజీకి కబురు పంపారు.

ఆ వార్త అందిన వెంటనే, ''పర్యటన జరుగుతుంది. నిర్ణీత కార్యక్రమం ప్రకారం జరుగుతుంది'' అని ఆయా కార్యకర్తలకు గురూజీ టెలిగ్రాములు ఇప్పించారు. ఆ తర్వాత పర్యటన ప్రారంభమైంది. అనుకున్న ప్రకారం జరి గింది. తన అభిప్రాయం కార్యకర్తలముందు ఉంచుతూ గురూజీ ఇలా ప్రసంగిం చారు. ''ఇతరులు భయపడిన సమయంలో, గాబరాపడిన సమయంలో మనం మరింత దృఢంగా ఆపదలను ఎదుర్కొడ్డి నిలవాలి. సంఘం నిర్భయత్వాన్ని

ఉపాసిస్తోంది. నిర్భీకతను సమాజం అంతటిలో నిర్మించడం సంఘం చేపట్టిన పని. మనమే భయపడితే ప్రజలు ఎవరి అండన నిలుస్తారు?

ముస్లింలీగ్, ముస్లిం ప్రజలలో హెచ్చుమంది ఆంగ్లేయుల బేధ నీతికి లోబడిపోయారు. ఆంగ్లేయులు వారి నాడి తెలుసుకున్నారు. ఇస్లాం పేరిట వారిని రెచ్చగొట్టవచ్చునీ, ఆవిధంగా భారతీయులను చీల్చవచ్చునీ, విశాలమైన ఈ దేశాన్ని విభజించవచ్చని వారు తెలుసుకున్నారు. వారు అందుకోసం ఎత్తులు వేశారు. జిత్తులు పన్నారు. 1947లో దేశమంతటా ముస్లింలు మారణకాండ ప్రారంభించారు. పంజాబులో భారీ ఎత్తున హిందువులను ఊచకోత కోశారు. చివరికి దేశవిభజన జరిగింది. పంజాబులో, బెంగాలులో రక్తపుటేరులు పారాయి .

అప్పుడు పంజాబులో సంఘశిక్షావర్గలు జరుగుతున్నాయి. ఫగ్వాడా శిక్షావర్గలో 1400 మంది స్వయంసేవకులు ఉన్నారు. సంగ్రూర్ శిక్షావర్గలో 2300 మంది స్వయంసేవకులు ఉన్నారు. ఉన్నట్టుండి పిడుగు పడింది. ఆంగ్లేయులు దేశవిభజన ప్రకటించారు. శిక్షావర్గలను మధ్యలోనే నిలిపివేయవలసి వచ్చింది. స్వయంసేవకులు త్వరత్వరగా తమతమ స్వంత ఊళ్ళకు బయలు దేరారు. కానీ, వారిలో కొందరు తమ ఇళ్ళను చేరనే లేదు. కొందరిని ముస్లింలు త్రోవలోనే చంపివేశారు. కొందరి ఇళ్ళూ, ఊళ్ళూ ధ్వంసం అయినాయి. పంజాబు ప్రాంతం రణరంగంగా మారిపోయింది. అంతటా మారణహోమం. అంతటా అగ్నిజ్వాలల భుగభుగలు. పచ్చని పంట పొలాలు, కలకలలాడే పల్లెపట్టులు కాలి నుసి అయిపోతున్నాయి. బీరాలు పలికే నాయకులు కొందరు పిక్కబలం చూపారు. కొందరు అయిపు ఆనవాలు లేకుండా పోయారు. వారికి సమాజం సంగతి పట్టలేదు. బ్రతికి ఉంటే బలుసాకు తినవచ్చు అనుకున్నారు వారంతా.

అలాంటి పరిస్థితిలో శ్రీ గురూజీ పంజాబులో పర్యటన జరుపు తున్నారు. గ్రామ గ్రామానికీ వెళ్ళి స్వయంసేవకులను కలుసుకుంటున్నారు

వారికి ధైర్యం చెపుతున్నారు. వారిని ఓదార్చుతున్నారు. అనాథలు నిర్వాసులు, నిస్సహాయులు అయిన హిందూ సోదరుల శిబిరాలకు వెళుతున్నారు. ఆపదలనుంచి బయటపడటం ఎలాగో వారికి బోధిస్తున్నారు. వారిలోని వీరత్వాన్ని మేలుకొలుపుతున్నారు. అందరిలో నిర్భీకతను నింపుతున్నారు. ధీరోదాత్తమైన తన వాక్కుతో, ఓజస్సుతో నిండిన తన వాణితో ఆయన హిందూ బంధువులు అందరిలో, ముఖ్యంగా స్వయంసేవకులలో వీరరసాన్ని జాగృతం చేస్తున్నారు. వారిలో ఆత్మవిశ్వాసాన్ని నింపుతున్నారు. ఆనాడు పంజాబులోని బాల స్వయంసేవకులు, కిశోర్ స్వయంసేవకులు వీరాభిమన్యులై విక్రమించారు. మహత్తరమైన సేవ చేశారు

# 19. రక్తరంజిత స్వరాజ్యం

స్వరాజ్యం వచ్చింది. దేశాన్ని ముక్కలు చేసి మరీ వచ్చింది. హిందువుల కష్టాలకు మేరలేదు. పాకిస్థాన్‌లో అయితే హిందువుల ఊచకోత భారీ ఎత్తున జరిగింది. మృత్యువు కోరలనుంచి ఎలాగో తప్పించుకొని బయటపడి భారత దేశానికి వచ్చిన వారికి అవమానాలు ఎదురైనాయి. తమ స్వదేశంలోనే, తమ మాతృభూమి ఒడిలోనే తమ హిందూ సోదరులే వారిని శరణార్థులు అని పిలువసాగారు.

భారత్‌లోని ముస్లింలు హాయిగా సుఖంగా జీవితం గడుపుతున్నారు. అయినా కొందరు ముస్లిం నాయకులు గాయాలపై కారం రుద్దుతున్నారు. ''హస్‌కె లియాహై పాకిస్థాన్, లడ్‌కే లేంగే హిందుస్థాన్'' (నవ్వుతూ నవ్వుతూ పాకిస్థాన్ తెచ్చుకున్నాం. యుద్ధం చేసి హిందుస్థాన్ గెలుచుకుంటాం) అంటూ నినాదాలు ఇస్తున్నారు. కాంగ్రెస్ నాయకులు దోషం అంతటినీ హిందూ సమాజం నెత్తిన రుద్దుతున్నారు. శాంతి, సోదరభావం అనే ఉపదేశాలను వారు హిందూసమాజానికే నూరిపోస్తున్నారు.

శ్రీ గురూజీ స్వయంసేవకుల ముందు విశాలమైన దృక్పథాన్ని ఉంచారు. కాంగ్రెస్‌వారు అయినా, మరోపార్టీవారు అయినా వారంతా హిందువులే. మన బంధువులే. ఇదీ ఆయన దృష్టి. మన మధ్య అభిప్రాయ భేదాలు ఉన్నప్పటికీ మనలో మనం తగాదా పడకూడదన్నది ఆయన అభిప్రాయం. గురూజీ ఇలా హితవు చెప్పేవారు ''ధర్మరాజు చెప్పిన మాట మనం దృష్టిలో పెట్టుకోవాలి. గంధర్వులు , కౌరవులను బంధించినప్పుడు భీముడు సంతోషం వ్యక్తం చేశాడు. అపుడు ధర్మరాజు భీమునితో ఇలా అన్నాడు - చూడు, మనలో మనకు తగాదా వచ్చినప్పుడు వారు నూరుగురు, మనం ఐదుగురం. కానీ మూడవవారు ఎవరితో అయినా వివాదం వస్తే మనం నూట అయిదుగురం. వయం పంచాధికం శతమ్''

ముస్లిం నాయకులు తీవ్రాతితీవ్రంగా ప్రసంగిస్తున్నారు. తమ అనుచరులను మరింతగా రెచ్చగొడుతున్నారు. కాశ్మీర్, జునాగఢ్, హైదరాబాద్ సంస్థానం, అలీగఢ్, రామ్‌పూర్, అస్సాం మొదలైన భూభాగాలు ముస్లింలవేననీ, అక్కడ ముస్లింల రాజ్యం స్థాపిస్తామనీ, స్థాపించి తీరతామనీ వాదించేవారు. నైజాము సంస్థానంలో ముస్లిం రజాకార్లు హిందువుల జీవితాలను దుర్భరం చేశారు. అక్కడ న్యాయం అనేది మచ్చుకయినా మిగులలేదు. రజాకార్ల అత్యాచారాలు మితిమీరిపోయాయి. ఇంత జరుగుతున్నా కాంగ్రెస్ నాయకులు ముస్లింలను బుజ్జగిస్తూనే ఉన్నారు.

దేశమంతా క్షోభించిపోయింది. మహాత్మాగాంధీ అప్పుడు ఢిల్లీలో మకాం చేశారు. ప్రతిరోజూ సాయంత్రం జరిగే ప్రార్థన సమావేశాలలో ఆయన శాంతినీ, ప్రేమనూ, బంధుభావాన్నీ ప్రబోధించేవారు. భారత్ పాక్‌కు 55 కోట్ల రూపాయలు తప్పకుండా ఇవ్వాలని ఆయన పట్టుబట్టారు. అందుకోసం ఆమరణ నిరాహారదీక్షకు సైతం ఆయన సిద్ధపడ్డారు. ఫలితంగా, గాయపడ్డ వారు, వేదన పొందినవారు పలువురు గాంధీజీని విమర్శించసాగారు. ''ఈయన ఇలా మాట్లాడడంవల్లనే, ఇలాచేయడంవల్లనే ముస్లింలు నెత్తికెక్కి కూర్చు

న్నారు. ఈయన చేసే ప్రకటనలవల్ల పాకిస్తాన్ బలపడుతోంది ''- అనే విమర్శ నలుగడలా వినిపించింది. కొందరు యువకులు ఆవేశాన్ని అణచుకోలేక పోయారు. వారిలో ఒకడు 1948 జనవరి 30 సాయంత్రం ప్రార్థన సమావేశంలో గాంధీజీని పిస్తోలుతో కాల్చి హత్య చేశాడు.

ఆ సమయంలో గురూజీ తమిళనాడులో పర్యటిస్తున్నారు. జనవరి 30 సాయంత్రం ఆయన మద్రాసులో ఉన్నారు. శ్రీ రామస్వామి అయ్యర్ గృహంలో పురప్రముఖులకు తేనీటి విందు జరిగింది. గురూజీ అందరినీ పరిచయం చేసుకున్నారు. ఆ తర్వాత సంఘకార్య రూపురేఖలను వారికి స్పష్టం చేశారు. ప్రసంగం తర్వాత తేనీరు వచ్చింది. ప్రముఖులంతా టీ త్రాగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. గురూజీ ఓ గుక్క టీ త్రాగారో లేదో, ఈలోగా రేడియోలో విన్న ఆ దారుణవార్తను ఎవరో మోసుకువచ్చారు. వార్త విన్న గురూజీ టీ త్రాగకుండానే కప్పు క్రింద పెట్టేశారు. ''దేశానికి పెద్ద దురదృష్టం పట్టుకున్నది'' అనే మాట ఆయన నోటివెంట వెలువడింది.

గురూజీ తన పర్యటన కార్యక్రమం రద్దు చేశారు. నాగపూరు తిరిగి వచ్చారు. పదిరోజులపాటు శోకదినాలు పాటించవలసిందిగా సంఘశాఖలు అన్నింటికీ ఆదేశాలు వెళ్ళాయి. గురూజీ పత్రికా ప్రతినిధులతో ప్రసంగిస్తూ తన భావాలను ఇలా వ్యక్తం చేశారు. ''మహాత్మాగాంధీ ఆధునిక యుగానికి చెందిన అతి శ్రేష్ఠవ్యక్తి. ఆదరణీయుడైన వ్యక్తి. ఆయన హత్య దయమాలిన పని. పాశవికమైన పని. ఈ దుర్ఘటనకు నేను ఎంతో చింతిస్తున్నాను. ఈ పాపపు పని చేసిన వ్యక్తి హిందువని తెలుసుకొని ఆలోచనాపరులంతా సిగ్గుపడతారు. గాంధీజీ శాంతమూర్తి. వివిధ వర్గాల మధ్య ఏకత్వాన్ని సాధించే సామర్థ్యం కలిగిన ఒకే ఒక మహాపురుషుడు. ఆయనను హత్య చేసిన వ్యక్తి జాతికి క్షమించరాని అపచారం చేశాడు. అపరాధం చేశాడు.''

# 20. ''దైవమే నాకు రక్ష''

గాంధీజీ హత్యతో సంఘానికిగానీ, గురూజీకి గానీ సంబంధంలేదని స్పష్టంగా కనబడుతున్నది. అయినా ప్రధాన మంత్రి, ఇతర మంత్రులు, పెద్ద పెద్ద కాంగ్రేస్ నాయకులు సంఘం మీద బురద జల్లడం ప్రారంభించారు. సంఘంపైన, గురూజీపైన లేనిపోని ఆరోపణలు కురిపించసాగారు. ఆ ఆరోపణలు విని, గ్రామ గ్రామాన ఛోటా నాయకులు కూడా నోటికి వచ్చినట్లు ప్రేలారు. సంఘంపైన తిట్లుకవిత్వం సాగించారు. పెరుగుతున్న సంఘశక్తి వారందరికీ కంటకప్రాయంగా ఉంది. అందువల్ల అసూయ, మాత్సర్యం, ద్వేషం వంటి దుర్గుణాలు విలయతాండవం చేశాయి. మహాత్మాగాంధీ పేరుమీద జనం అబద్ధాలు చెప్పారు. అబద్ధాలు వ్రాశారు. పత్రికలలో రెచ్చగొట్టే వ్యాసాలూ, వార్తలూ, వ్యాఖ్యలూ, వచ్చాయి. ఆకాశవాణి కూడా విషం క్రక్కింది. ఫలితంగా అనేక స్థలాలలో సంఘ స్వయంసేవకులపై దాడులు జరిగాయి. స్వయంసేవకుల గృహాలను, దుకాణాలను, కర్మాగారాలను లూటీ చేశారు. తగులబెట్టారు. అలాంటి పరిస్థితిలో గురూజీ ప్రశాంతంగా ఉండవలసిందిగా అందరికీ ఆదేశాలు ఇచ్చారు. ''వీరంతా మన సోదరులే. ఇతరులు వీరిని పెడదారి పట్టించారు. వీరు చేసే పిచ్చి పనులకు మనం ఆవేశపడకూడదు. నిగ్రహం కోల్పోకూడదు''- అని గురూజీ అందరికీ హితవు చెప్పారు.

1948 ఫిబ్రవరి 1 ఉదయం గూండాలు గురూజీ ఇంటిని చుట్టుముట్టారు. ఇంటిమీద దాడి చేయడానికి ముందుకు వస్తున్నారు. బండబూతులు తిడుతున్నారు. హింసను రెచ్చగొడుతూ నినాదాలు చేస్తున్నారు. రాళ్లు రువ్వుతున్నారు.

ఆ వార్త నాగపూర్ అంతటా వ్యాపించింది. పలువురు స్వయం సేవకులు గురూజీ గృహం వద్దకు చేరారు. ''వేల సంఖ్యలో ఉన్న జనాన్ని చూసి మేము భయపడం. పరమ పూజనీయ గురూజీ ఇంటిపై దాడి చేయడం మజాకా

కాదు. మా ప్రాణాలు పోయినాసరే, ఈ గుంపును చెదరగొట్టి తీరుతాం'' అని అంటున్నారు.

దాడిని త్రిప్పికొట్టడానికి స్వయంసేవకులు పథకం వేసుకున్నారు. ముందుకు దూకబోతున్నారు. అంతలో గురూజీ స్వయంగా అక్కడికి వచ్చారు. ''వీరంతా మన సోదరులేనని గుర్తుంచుకోండి. నా ఈ శరీరాన్ని రక్షించడంకోసం వీరిలో ఎవరి శరీరం నుంచి ఒక్క రక్తపు బొట్టు చిందినా, నాకు మరణబాధ కలుగుతుంది. మీ హృదయంలో ఉన్న అభిమానం నాకు తెలుసు. అయినా , నిజమైన స్వయంసేవక్ నామాట మన్నించాలి. మీరంతా ప్రశాంతంగా మీ ఇళ్ళకు వెళ్ళిపోండి. నా గురించి బాధపడకండి. ఆ పరమేశ్వరుడే నా సంరక్షకుడని తెలుసుకోండి'' అని స్వయంసేవకులకు నచ్చజెప్పారు.

గట్టిగా, వాడిగా వెలువడ్డాయి ఆ పలుకులు. తేజస్సు ఉట్టిపడుతున్న ఆయన ముఖమండలాన్ని స్వయంసేవకులు కొద్దిక్షణాలపాటు అలా చూస్తూ ఉండిపోయారు. ఆ తర్వాత గురూజీ ఆదేశాన్ని తలదాల్చారు. బిగించిన పిడికిలి తెరచారు. తమ మహానాయకునికి ప్రణామం చేశారు. పరమేశ్వరుణ్ణే ప్రార్థిస్తూ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

నాటి రాత్రి పోలీసు అధికారులు అక్కడికి వచ్చారు. వారివెంట చాలా పెద్ద పోలీసు బలగం ఉంది. పోలీసులు గురూజీ గృహాన్ని చుట్టుముట్టారు. అర్ధరాత్రి పోలీసుశాఖ ఉన్నతాధికారి వచ్చాడు. గురూజీని పట్టుకుని తీసుకువెళ్ళాడు. 1948 ఫిబ్రవరి 4న కేంద్ర ప్రభుత్వం సంఘాన్ని నిషేధించింది. సంఘంపైన గురుజీపైన, హింస, మతతత్వం, కులతత్వం, రహస్య కార్యకలాపాలు, సైనిక సంస్థ, ప్రభుత్వ వ్యతిరేక చర్యలవంటి ఆరోపణలు మోపారు. సూర్యుడిపై ఉమ్మివేసే ప్రయత్నం సాగింది.

# 21. నిగ్రహానికి పిలుపు

శంకరుడు హాలాహలాన్ని పానం చేసినట్లు గురూజీ అపనిందలు, ఆరోపణలు అన్నింటినీ మ్రింగివేశారు. ''ప్రశాంతంగా ఉండండి నిగ్రహం పాటించండి'' - అని ఆయన స్వయంసేవకులను ఆదేశించారు. తమ మిత్రులు శ్రీ దత్తోపంత్ దేశపాండే ద్వారా ఆయన స్వయంసేవకులను ఉద్దేశించి ఒక లేఖ వ్రాశారు దాని సారాంశం ఇది ·

సంఘం ఎప్పుడూ చట్టాన్ని పాటిస్తూ వచ్చింది సంఘం అనుశాసనానికి ఎంతో విలువ ఇస్తుంది. మనం గతంలో ఎన్నడూ చట్టవ్యతిరేక చర్యలు జరపలేదు నేడూ జరపనవసరంలేదు. అందువల్ల నేను మన సంఘాన్ని రద్దు చేస్తున్నాను. నిషేధం తొలగనంతవరకూ సంఘం రద్దయే ఉంటుంది. ప్రభుత్వం మనపై చేసిన ఆరోపణలు పూర్తిగా నిరాధారమైనవి.

దేశమంతటా వేలాది స్వయంసేవకులను ఖైదు చేశారు. వారిపై అన్నిరకాల ఆరోపణలూ మోపారు. గాంధీజీ హత్యకు కుట్ర పన్నడం, దౌర్జన్యకాండ జరపడం, ప్రభుత్వాన్ని పడగొట్టడానికి ప్రయత్నించడం వంటి ఆరోపణలు శ్రీ గురూజీపై మోపారు. అయితే కొద్ది రోజులలోనే అధికారులకు తమ తెలివితక్కువతనం తెలిసివచ్చింది. మహాత్మాజీ హత్యతో సంఘానికి గానీ, గురూజీకి గానీ ఎలాంటి సంబంధమూ లేదని 1948 ఫిబ్రవరి చివరివారంలో గృహమంత్రి సర్దార్ వల్లభాయ్ పటేల్ ప్రధానమంత్రి పండిత జవహర్లాల్ నెహ్రూకు స్పష్టం చేశారు. అప్పుడు గురూజీపై మోపిన ఆరోపణలు అన్నింటినీ వారు ఉపసంహరించుకున్నారు. ఆయనను ఖైదులో మాత్రం ఉంచారు.

చాలా సంవత్సరాల తర్వాత గురూజీకి విశ్రాంతి లభించింది. బలవంతం చేస్తే తప్ప ఈ వ్యక్తి విశ్రాంతి తీసుకోరు. అందువల్ల ఈయనకు ఈ విధంగా

వి(శాంతి ఇవ్వాలి - అని పరమేశ్వరుడు భావించి వుండవచ్చు. అందువల్లనే ఆయనకు కారాగారవాసం లభించి ఉండవచ్చు. ఖైదులో ఆయన రోజూ యోగాసనాలు వేసేవారు. ధ్యానం, జపం, సంధ్య వంటి నిత్యకర్మలకు మరింత హెచ్చు సమయం కేటాయించేవారు. ఇక సంఘకార్యాన్ని గురించిన ఆలోచన ఖైదులోనూ జరిగేది

అంతేకాదు వివిధ నగరాలలో, వివిధ (ప్రాంతాలలో ఉన్న వేలాది కార్యకర్తలను రోజూ కలుసుకుంటూ ఉండేవారు. ఏవిధంగా ? మనస్సులోనే పక్కమీద పడుకున్నప్పుడు మానసిక పర్యటన జరిపేవారు. ఏదో ఒక నగరం వెళ్ళేవారు. అక్కడి కార్యకర్తలు ఒక్కొక్కరినీ స్మరించేవారు. ఈ సమయంలో ఎవరు ఎక్కడ వుండవచ్చు? ఏమి చేస్తూ వుండవచ్చు? ఏఏ విషయాలు ఆలోచిస్తూ వుండవచ్చు? ఈ విధమైన కల్పనా సామ్రాజ్యంలో ఆయన గంటల తరబడి విహరిస్తూ ఉండేవారు.

ఆయన రోజూ ఉదయం 5 గంటలకు నిద్రలేచేవారు. కాలకృత్యాలు ముగించుకొని టీ త్రాగేవారు. భగవద్గీత పఠించేవారు. స్నానం, సంధ్య, అల్పాహారం అయిన తర్వాత పుస్తకాలు చదివేవారు. మధ్యాహ్న భోజనం తర్వాత కొద్దిగా వి(శాంతి తీసుకునేవారు. తన గదినీ , పరిసరాలనూ పరిశుభ్రంగా వుంచేవారు. ఆయనకు పనులు చేయడానికి ఒక ఖైదీని నియమించారు. పరిశుభ్రత అతనికి సరిపడని సంగతి. ఒకసారి గురూజీ స్వయంగా అతని బట్టలు ఉతికారు. అలాగే, అక్కడ పని చేయడానికి వచ్చే ఖైదీల యోగక్షేమాలను ఆయన విచారించేవారు. పలు విధాలుగా వారికి సాయపడేవారు. వారితో కలివిడిగా మాట్లాడేవారు. వారితో హాస్యంగా వినోదంగా కబుర్లు చెప్పేవారు.

సంఘ స్వయంసేవకులను నేరం ఏదీ లేకుండానే ప్రభుత్వం జైళ్ళలో కుక్కింది. ''హెబియస్ కార్పస్'' దరఖాస్తులు దాఖలు చేయటానికి గురూజీ వారందరికీ అనుమతి ఇచ్చారు. హెబియస్ కార్పస్ అంటే ''వ్యక్తిని ప్రత్యక్షంగా

హాజరు పెట్టండి అతడు చెప్పవలసింది చెప్పనీయండి'' అని అర్థం అయితే ఆయన తనకోసం ఆ దరఖాస్తు దాఖలు చేయలేదు.

1948 ఆగస్టు 6న ప్రభుత్వం గురూజీని విడుదల చేసింది. అయితే ఆయనపై అనేక నిర్బంధాలు విధించింది. నాగపూర్‌లోనే ఉండాలి. ఉపన్యాసాలు ఇవ్వకూడదు. వ్యాసాలు వ్రాయకూడదు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రచారం చేసి ప్రజలలో అసంతృప్తిని వ్యాప్తి చేయకూడదు. శాంతికి భంగం కలిగించ కూడదు.

శ్రీ గురూజీ పండిత.జవహర్లాల్ నెహ్రూకు, సర్దార్ పటేల్‌కు లేఖలు వ్రాసారు. సంఘంపై అన్యాయంగా విధించిన నిషేధాన్ని తొలగించవలసిందిగా కోరారు. సంఘంపై రుద్దుతున్న ఆరోపణలు ఎంత బూటకమైనవో, ఎంత నిరాధారమైనవో, ఎంత హాస్యాస్పదమైనవో స్పష్టం చేశారు.

1948అక్టోబర్ 17న ఆయన ఢిల్లీ వెళ్లారు. సర్దార్ పటేల్‌ను కలుసుకున్నారు. సంఘానికి సంబంధించిన విషయాలు అన్నింటినీ పటేల్‌కు వివరించారు. కూలంకషంగా నవంబర్ 2న ఆయన పత్రికా ప్రతినిధుల గోష్ఠిలో ప్రకటన విడుదల చేశారు. పత్రికా ప్రతినిధులు అడిగిన ప్రశ్నలకన్నింటికీ సమాధానాలు చెప్పారు. వారి అనుమానాలు తొలగించారు. ఆ గోష్ఠి ద్వారా ఆయన సంఘానికి జరిగిన అన్యాయం ఎంత దారుణమైనదో ప్రజలముందుం చారు. ఢిల్లీ వదలి వెళ్ళవలసిందిగా ప్రభుత్వం ఆయనకు ఉత్తర్వు జారీ చేసింది. ఆయన ఆ ఉత్తర్వును పాటించలేదు. 1948 నవంబర్ 12న ప్రభుత్వం ఆయనను తిరిగి ఖైదులో పెట్టింది.

# 22. మ్రోగింది రణభేరి

ఇకముందు ఏమి జరుగనున్నదో గురూజీకి పూర్తిగా అవగాహన అయింది. సర్దార్ పటేల్‌తో జరిపిన చర్చలో గురూజీ ఆయన వైఖరి ఏమిటో చూశారు. నెహ్రూజీ తరచు చేసే ప్రసంగాలల్లో కూడా న్యాయానికీ, నీతికీ

విలువ లేకపోవడం కనిపించింది. సంఘానికి శ్రేయోభిలాషులు వేలాదిగా ఉన్నారు. అంతటా ఉన్నారు. వారు గురూజీకి ఎన్నో ముఖ్యవిషయాలు చెప్పేవారు. శ్రీ గురూజీ పరిస్థితిని పూర్తిగా ఆకళింపు చేసుకున్నారు. అందు వల్ల ఆయన కార్యకర్తలతో సమాలోచనలు జరిపి తర్వాత తీసుకోవలసిన చర్య లను గురించి మొత్తం ప్రణాళిక తయారు చేశారు.

ప్రభుత్వం గురూజీని ఖైదు చేసిన తర్వాత ఏకనాథ్‌జీ రానడే, ప్రొఫెసర్ భాయి మహావీర్‌లు అనంతర కార్యక్రమానికి ఆధ్వర్యం వహించారు. సరకార్య వాహ శ్రీ భయ్యాజీ దాణీ దేశవ్యాప్తంగా సత్యాగ్రహం జరపవలసిందిగా స్వయం సేవకులను ఆదేశించారు. శ్రీ గురూజీ ఇచ్చిన సందేశాన్ని స్వయంసేవకులకు అందించారు. ఆ సందేశంలో ఇలా వుంది :

''... . నేడు మన దేశంలో అభారతీయమైన సిద్ధాంతాలు, అభిప్రా యాల ప్రభావం పెరుగుతూ ఉండడం విచారకరమైన విషయం. దురదృష్ట కరమైన విషయం. దానితోపాటు దేశంలోపల దుష్ట ప్రవృత్తులు పెరుగు తున్నాయి. ఈ రెంటి పంజాలనుంచి మనం మన దేశాన్ని విముక్తి చేయవలసి వుంది. ఈ దేశంలో ప్రతి వ్యక్తీ స్వతంత్రంగా జీవించగలిగే విధంగా, సుఖంగా గౌరవంగా మనగలిగే విధంగా మనం మార్పు తీసుకురావలసి వుంది. ఇది దైవకార్యం. దీనిని స్వీకరించినప్పుడే మానవత్వం మనుగడ నిలుస్తుంది. దీనిని స్వీకరించినప్పుడే మనకు పరమేశ్వరుడు సాక్షాత్కరిస్తాడు.''

''ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ని బోధత.'' లేవండి. మేల్కొనండి. ఉద్యమించండి. లక్ష్యాన్ని సాధించి చూపండి. గత పది నెలలుగా మనకు ప్రియ తమమైన సంఘకార్యం ఆగిపోయి వుంది. దానిని మనం ఇప్పుడు తిరిగి ప్రారంభించాలి. పది నెలలపాటు మనం మౌనంగా కూర్చుని ఉన్నాం. ఇప్పుడు మనం ఆ లోటును పూర్తిగా భర్తీ చేయాలి. సత్యం మన పక్షాన ఉంది. న్యాయం మన పక్షాన ఉంది. అన్యాయాన్ని సహిస్తూ ఉండడం అంటే అన్యాయాన్ని జరిపే వారికి సహాయం అందించడమే. ఆ పాపం మనకు వద్దు. సత్యానికి ప్రేరణ

ఇచ్చేవాడు భగవంతుడే. ఆయన రూపాన్ని మనం మన హృదయాలలో నింపుకుందాం. భారతమాతను ధ్యానం చేద్దాం. మనసులో విశాలమైన ప్రేమభావనను నింపుకుందాం ప్రారంభించండి. మన సంఘాన్ని తిరిగి ప్రారంభించండి. కదలండి. పురోగమించండి. మన లక్ష్యాన్ని చేరుకునేవరకు ఎక్కడా ఆగకండి.''

''ఇప్పుడు యుద్ధం ప్రారంభమయింది. ధర్మం, ఆదర్శం మీద, న్యాయం అన్యాయం మీద, విశాలత్వం సంకుచితత్వం మీద జరుపుతున్న యుద్ధం ఇది. స్నేహ భావన, దుష్టత్వం మీద జరుపుతున్న యుద్ధమిది. మన విజయం నిశ్చయం. ధర్మం ఏపక్షాన ఉంటే ఆ పక్షానికి భగవంతుడు సహాయం చేస్తాడు. భగవంతుడు ఎవరికి సహాయకుడుగా ఉంటాడో వారికే విజయం లభిస్తుంది. ఇక విజృంభించండి. హృదయాకాశం నుంచి జగదాకాశం వరకు భారతమాతకు జయజయధ్వానాలు చేస్తూ విజృంభించండి. విజయం సాధించండి.''

# 23. సత్యాగ్రహ సమరం

ఆ సందేశం దేశమంతటా విద్యుచ్ఛక్తిలా ప్రవహించింది. స్వయం సేవకుల హృదయాలలో యుద్ధావేశం అగ్నిజ్వాలలా రగుల్కొన్నది. ప్రతినగరంలో, ప్రతి గ్రామంలో సమావేశాలు జరుగుతున్నాయి. సత్యాగ్రహం ఏయే స్థలాలలో జరగాలి? ఎవరు ఎక్కడ సత్యాగ్రహం చేయాలి? ప్రతి జిల్లాలో ఎంతమంది సత్యాగ్రహంలో పాల్గొంటారు? ఆయా విషయాలపై సమాలోచనలు జరుగుతున్నాయి. జాబితాలు తయారవుతున్నాయి. కరపత్రాలు అచ్చవుతున్నాయి. రహస్య స్థలాలలో సైక్లోస్టైల్ యంత్రాలమీద చిన్న చిన్న వార్తా పత్రికలు ముద్రించి పంచుతున్నారు.

సత్యాగ్రహం ఏ పద్ధతిలో జరగాలో నిర్ణయమైంది నగరంలోకానీ, గ్రామంలోకానీ పెద్ద మైదానంలో స్వయంసేవకులు సమావేశం అవుతారు. శాఖ

జరుపుతారు. ప్రార్థన చేస్తారు. పోలీసులు అరెస్టు చేస్తే, ప్రశాంతంగా వారివెంట వెళ్ళిపోతారు. ఎలాంటి ప్రతిఘటనా ఉండదు. సంఘానికి మచ్చవచ్చే పని ఏదీ జరగదు. జైలులోనికి వెళ్లిన తర్వాత శాఖ నడుపుతారు. అక్కడి నియమ నిబంధనలు అక్షరాలా పాటిస్తారు. ఈ విషయాలన్నీ అందరికీ వివరించారు.

1948 డిసెంబర్ 9న దేశంలోని ప్రముఖ నగరాలలో సంఘానికి సంబంధించిన కరపత్రాలు .అనేకం పంచారు. సత్యాగ్రహం ఎక్కడ జరుగు తుందో ఎలా జరుగుతుందో ముందుగానే అధికారులకూ, ప్రజలకు తెలియ జేశారు. సాయంత్రం నిర్ణీత స్థలంలో శాఖ జరిగింది. వేలాది ప్రేక్షకులు ఆదృశ్యం చూస్తున్నారు. పోలీస్ వ్యాన్‌లు వచ్చాయి. అనేక స్థలాలలో పోలీసులు లాఠీలు ప్రయోగించారు. అయినా స్వయంసేవకులు అంతా సహించారు. స్వయంసేవకులు శాఖ నడిపారు. ప్రశాంతంగా, ధైర్యంగా, పట్టుదలగా ప్రార్థన జరుగుతోంది.

నమస్తే సదా వత్సలే మాతృభూమే !
త్వయా హిందుభూమే సుఖం వర్ధితోహమ్ !
మహామంగలే పుణ్యభూమే త్వదర్థే !
పతత్వేష కాయో నమస్తే నమస్తే !

ప్రార్థన చివర స్వయంసేవకులు ''భారత్ మాతా కీ జయ్'' అంటూ గర్జించారు.

అప్పుడు దర్శకులుగా వచ్చిన వేలాది పౌరులు ఆ నినాదం అందుకుని, ''భారత్ మాతాకీ జయ్'' అంటూ నినాదం చేశారు.

పోలీసులు సత్యాగ్రహులను వ్యాన్‌లలోకి ఎక్కించారు. వ్యాన్‌లు నగరంలోని అనేక వీధులగుండా వెళ్లి జైలు ద్వారం వద్దకు చేరాయి. స్వయం సేవకులు తోవ పొడుగునా ''భారత్ మాతాకీ జయ్'' అంటూ నినాదాలు చేస్తున్నారు. ఉత్సాహంగా, ఉద్రేకంగా.

ఆవిధంగా 1948 డిసెంబర్ 9న దేశమంతటా సత్యాగ్రహం ప్రారంభ మయింది.

వేలాది నగరాలలో, గ్రామాలలో ఇలా సత్యాగ్రహం జరిగింది. జైళ్ళు స్వయంసేవకులతో నిండిపోతున్నాయి. రెండు నెలలలో అరవై వేలమంది స్వయంసేవకులు జైళ్లకు వెళ్లారు. ఇంత పెద్ద సత్యాగ్రహం, ఇంత క్రమబద్ధమైన సత్యాగ్రహం, ఇంత అనుశాసనబద్ధమైన సత్యాగ్రహం నాటి వరకు ఎవ్వరూ నిర్వహించలేకపోయారు.

పెక్కు కారాగారాలలో క్రూరత్వం, నిర్దాక్షిణ్యం నిండిన అధికారులు ఉన్నారు. వారు స్వయంసేవకులను చిత్రహింసలకు గురిచేశారు. కొన్ని జైళ్ళలో నాసిరకం తిండి పెట్టేవారు. కొన్ని జైళ్ళలో ఖైదీలకు జబ్బు చేస్తే మందులిచ్చే దిక్కు ఉండేది కాదు. కొన్ని జైళ్ళలో త్రాగడానికి మురికినీరు ఇచ్చేవారు. దానికీ కొరతే. అయినా స్వయంసేవకులు అన్నింటినీ సహించి నిలిచారు. శాంతంగా, దృఢంగా, స్వయంసేవకుల ధైర్యాన్ని నీరుగార్చడానికి అధికారులు చేయని ప్రయత్నం లేదు. అయినా స్వయంసేవకులు తొణకలేదు. బెణకలేదు. ఏఒక్కరూ క్షమాపణ చెప్పలేదు. ప్రభుత్వ అధికారులు జైలు లోపలా బయటా నానా యాతనలూ పెట్టారు. భయపెట్టారు. బెదిరించారు. ఇళ్లు సోదా చేశారు. ఆస్తులు జప్తు చేశారు. ఉద్యోగాలనుంచి తొలగించారు. బలవంతాన జైళ్ళలో కుక్కారు. వారి నైచ్యానికి అంతులేదు. అయినా స్వయంసేవకుల పట్టుదల సడలలేదు. నిష్ఠ చెదరలేదు. వారికి జైలులో ఎన్నో అసౌకర్యాలు ఉన్నాయి. అయితే ఒక బ్రహ్మాండమైన సౌకర్యం ఉంది. వారు శాఖ నడుపుకొనవచ్చు. ఒకే ఆదర్శం కోసం తపించే తమ స్వయంసేవక బంధువులను కలుసుకోవచ్చు. అక్కడ ఎన్నో కష్టాలు ఉన్నాయి. అయితే ఒక బ్రహ్మాండమైన సుఖమూ ఉంది. అక్కడ ప్రభుత్వ ఖర్చుతో శిబిరాలు నడుస్తున్నాయి. సంఘశిక్షావర్గ నడుస్తోంది.

ఆ విధంగా - సంఖ్యలో, వ్యాప్తిలో, అనుశాసనంలో, త్యాగంలో, దృఢత్వంలో, సౌజన్యంలో సంఘ సత్యాగ్రహం సాటిలేనిదిగా నిలిచింది.

సంఘం నిర్దోషి అనే వాస్తవాన్ని ప్రజలు గుర్తించారు. అధికారంలో ఉన్న వ్యక్తుల అన్యాయం చూసి ఆలోచనాపరులు ఎంతో ఆవేదన పొందారు. సంఘంపై నిషేధాన్ని తొలగించవలసిందిగా మధ్యవర్తులు పండిత నెహ్రూకు లేఖలు వ్రాశారు. ''కేసరి'' పత్రిక సంపాదకులు గ.వి.కేత్కర్, విఖ్యాతి పొందిన విద్వాంసులు టి.ఆర్. వెంకట్రామశాస్త్రి, బాబాసాహెబ్ ఖాపర్డే వంటి పెద్దలు మధ్యవర్తులుగా పనిచేశారు. పటేల్‌ను, ఇతర ప్రముఖులను కలుసుకున్నారు. చివరికి సంఘం తన నిబంధనావళిని వ్రాతమూలకంగా ఇచ్చింది. ప్రభుత్వం బేషరతుగా సంఘంపై నిషేధాన్ని తొలగించింది. పుటం పెట్టిన తర్వాత బంగారం వన్నె పెరుగుతుంది. అలాగే, ఈ అగ్ని పరీక్ష నుంచి వెలికి వచ్చిన తర్వాత సంఘం తేజస్సు పెరిగింది.

సంఘం గెలిచింది. సత్యం గెలిచింది. శ్రీ గురూజీ గెలిచారు.

# 24. సన్మాన పర్వం

1949 జూలై 12న సంఘంపై నిషేధం తొలగించారు. జూలై 13న శ్రీగురూజీని బేతుల్ జైలునుంచి విడుదల చేశారు. ''ఇక మనమంతా సంఘకార్యాన్ని యథాప్రకారం కొనసాగించాలి'' - అనే గురూజీ ఆదేశం అందగానే గ్రామ గ్రామాన శాఖలు తిరిగి ప్రారంభమైనాయి. సంఘస్థాన్‌లో భగవాధ్వజం రెపరెపలాడుతోంది. స్వయంసేవకులు నవోత్సాహంతో సంఘం పనిలో లీనమైనారు.

గురూజీ పర్యటన తిరిగి ప్రారంభమైంది. ఆయన ఎక్కడకు వెళ్ళినా స్వయంసేవకులలో ఉత్సాహం ఉరకలు వేసేది. గురూజీని చూడగానే స్వయంసేవకులు ఆనందంలో పొంగిపోయేవారు. ఆ ఉద్వేగంలో అంతా మరచి ''శ్రీ గురూజీకి జయ్'', ''మాధవరావ్ సదాశివరావ్ గోళ్వల్కర్‌జీకి జయ్'' అంటూ నినాదాలు చేసేవారు.

గురూజీ వారిని వారించేవారు. వాడి అయిన మాటలతో మందలించే వారు. తీయటి మాటలతో నచ్చజెప్పేవారు. ''మనమంతా సంఘ స్వయం సేవకులం. మనకు తెలిసిన నినాదం ఒకే ఒక్కటి. ''భారత్‌మాతాకీ జయ్'' వ్యక్తులకు జయజయనినాదాలు ఇవ్వడం నేర్పలేదు సంఘం మనకు. ఈ నియమాన్ని మరచి ఎవరో మాధవరావ్ గోళ్‌వల్కర్ అనే వ్యక్తికి జయజయ నినాదాలు ఇవ్వడం అనుశాసనాన్ని ఉల్లంఘించడమే అవుతుంది. అలాంటి పరిస్థితిలో నేను మీతో కలిసి ఉండనని గుర్తించండి'' - అంటూ పొరపాటు సరిదిద్దేవారు గురూజీ.

ప్రముఖ నగరాలు అన్నింటినీ ఆయన దర్శించారు. ఆయన రాక సందర్భంగా పెద్ద పెద్ద స్వాగత సభలు జరిగాయి. జన సముద్రం పొంగి పొరలింది. గురూజీ ప్రసంగాలు విని అంతా ప్రభావితులు అయినారు అంతా చకితులు అయినారు. అసూయ, ద్వేషం, మాత్సర్యం, ఆగ్రహం వంటి భావాల ఛాయలు సైతం ఆయన ప్రసంగాలలో లేవు. రకరకాలుగా వేధించిన వారిని గురించి, నీచాతినీచంగా నిందలు వేసిన వారిని గురించి , అవమానాలు కురిపించిన వారిని గురించి ఆయన పల్లెత్తు మాట అనలేదు. పైగా ఆయన ఇలా బోధించారు. ''చూడండి. భోజనం చేసేటప్పుడు ఒకోసారి మనం నాలిక కరుచుకుంటాం. ఎంతో బాధ కలుగుతుంది. అయినా మనకు పళ్ళమీద కోపం వస్తుందా? పళ్ళు పీకేసుకుంటామా? నిషేధం విషయంలో మనం అలాగే ఆలోచించాలి. మనకు ఎవరిమీదా కోపం ఉండకూడదు. వారంతా మన సోదరులు. వారు వ్యతిరేకించవచ్చు. తిట్టవచ్చు. అయినా వారంతా మన అన్నదమ్ములే. వారు రేపటి స్వయంసేవకులు.''

స్వయంసేవకులను ఉద్దేశించి ప్రసంగిస్తూ గురూజీ ఇలా హెచ్చరిక చేశారు. ''ఈ జనం , ఈ కోలాహలం, ఈ ఊరేగింపులు, ఈ నినాదాలు, ఈ స్వాగత సత్కారాలు, ఈ పూలదండల గుట్టలు ఈ ఫొటోగ్రాఫ్‌లు - ఇవన్నీ మన పని కావు. వీటివల్ల సాధించేదేదీ లేదు. మనం చక్కటి శాఖలు నడపాలి.

ఆ శాఖలలో ప్రతిరోజూ మంచి సంఖ్య రావాలి. ఆ శాఖలలో నియమబద్ధంగా కార్యక్రమాలు జరగాలి. మన దైనందిన కార్యక్రమానికి భిన్నంగా జరుగుతున్న ఈ హడావుడి అంతా ఒక ప్రత్యేక సందర్భానికి సంబంధించింది. తాత్కాలికమైనది ఇది ఆపద్ధర్మం వంటి ఉపశమనం. ఈ ప్రదర్శనకు ఎక్కువ విలువ ఇవ్వకూడదు. గుండె నిండా శ్రద్ధ నింపుకుని నియమ పూర్వకంగా శాఖలమీద దృష్టి లగ్నం చేయాలి.

కొందరు మనకు అన్యాయం చేసి ఉండవచ్చు. వారిలోని చెడును మనం మరచిపోవాలి. వారిని క్షమించాలి. మన సంఘకార్యానికి ఆధారం ద్వేషం కాదు - ప్రేమ. ''

దేశమంతటా ఆయనకు సన్మానాలు జరిగాయి. పెద్ద పెద్ద ఊరేగింపులు జరిగాయి. వేలాదిగా స్వాగత ద్వారాలు నిర్మించారు. దీపోత్సవాలు జరిగాయి. పుష్పవర్షం కురిసింది. లక్షలాది ప్రజలతో బ్రహ్మాండమైన సభలు జరిగాయి. ఢిల్లీలో ఆయనను కనీవినీ ఎరుగని విధంగా సన్మానించారు. ఐదు లక్షలమంది రామలీలా మైదానంలో జరిగిన ఆ కార్యక్రమంలో పాల్గొన్నారు. 1500మంది పుర ప్రముఖులు ఆయనకు సన్మానపత్రం సమర్పించారు.

దేశం నాలుగు చెరగులా ఆయన జరిపిన ఈ ప్రచారం ఎంతో ప్రభావం కలిగించింది. అందువల్ల - సంఘంపైబడ్డ దుమ్ము తొలగిపోయింది. సందేహం, నిరాశ, భయం - అన్నీ పటాపంచలు అయినాయి. స్వయంసేవకులు దైనిక కార్యక్రమాలను ఎప్పటివలె నిర్వహించసాగారు.

గురూజీపై పూలవర్షం; ప్రశంసల వర్షం కురిసినట్లే - కొందరు నిందలు కురిపించారు. విదేశాల ప్రేరణ పొంది, అసూయ చెందిన వ్యక్తులు రాళ్ళు కురిపించే ప్రయత్నం చేశారు.

అయినా, గురూజీ ఆ స్తుతులకు పొంగిపోలేదు. ఆ నిందలకు క్రుంగిపోలేదు. తనవైపు విసరిన రాళ్ళను సైతం ఆయన పూలుగా పరిగణించి స్వీకరించారు. మొండిగా సంఘాన్ని వ్యతిరేకించేవారికీ, తిట్లూ, శాపనార్థాలూ

కురిపించే వారికీ ఆయన ప్రేమనే పంచి ఇచ్చారు.

తుల్యనిందా స్తుతిర్ మౌనీ సంతుష్టో యేన కేనచిత్

అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః

- నిందా స్తోత్రములను సమముగా చూచెడు వాడును, మౌనము దాల్చినవాడును, లభించిన దానితో తృప్తి చెందువాడును, నివాసము లేని వాడును, నిశ్చలచిత్తుడును, భక్తిమంతుడును అయిన నరుడు నాకు ఇష్టుడు.

గురూజీ జీవితం భాగవద్గీతలోని పై శ్లోకానికి (12-19)దర్పణం.

సంఘకార్యం కోన కోనకూ విస్తరించింది. ప్రతి ప్రాంతంలో ప్రతి జిల్లాలో సంఘశాఖలు పెరిగాయి. నిషేధ సమయంలో జరిగిన నష్టాన్ని భర్తీ చేయడానికై గురూజీ, సంఘ కార్యకర్తలూ ఎంతగానో శ్రమించవలసి వచ్చింది.

1956 ఫిబ్రవరి 7న గురూజీకి యాభై సంవత్సరాలు నిండాయి. ఆ సందర్భంగా ఉత్సవాలు జరుపుతామని కార్యకర్తలు అభిప్రాయం వ్యక్తం చేశారు. గురూజీ అందుకు అనుమతి ఇవ్వలేదు. అయినా కార్యకర్తలు గట్టిగా పట్టుపట్టేసరికి ''పేరు నాది ఫలితం సంఘానిది అయ్యే విధంగా ఆ ఉత్సవం రూపురేఖలు దిద్దాలి'' అని గురూజీ అందుకు షరతు పెట్టారు. కార్యకర్తలు ఆ షరతుకు ఆనందంగా అంగీకరించారు. ప్రతి ప్రాంతంలో అందుకు ప్రణాళికలు రూపొందించారు. స్వయంసేవకులు కొత్త గ్రామాలకు వెళ్లారు. కొత్త వ్యక్తులను కలిశారు. పెద్ద మొత్తంలో నిధిసేకరణ జరిగింది. కొత్తశాఖలు ఏర్పడ్డాయి. గురూజీ వివిధ కేంద్రాలలో జరిగిన సార్వజనిక ఉత్సవాలలో ప్రసంగించారు. సంఘకార్యం ద్వారా జాతికి ఎలా శాశ్వత ప్రయోజనం కలుగుతుందో ప్రజలకు తెలియజెప్పారు. ఇక సంఘకార్యం మరింత వేగంగా పెరుగసాగింది.

# 25. సారథి, సచివుడు

సంఘకార్యానికి ఓ ప్రత్యేకత వుంది. కార్యకర్త తాను పనిచేయాలి. దానితోపాటుగా సహచరులను నిర్మాణం చేయాలి. సంఘం నేర్పేది ఇదే. ఏకార్యకర్త కూడా తాను ఒంటరిగా మిగిలిపోయే పరిస్థితి తెచ్చుకోకూడదు. సంఘకార్యం వ్యక్తి నిష్ఠ కాదు. ధ్యేయనిష్ఠ. సంఘంలో శ్రద్ధా భక్తులు వ్యక్తిమీద కాక ఆదర్శం మీద లగ్నమై ఉంటాయి. నెహ్రూ తర్వాత ఎవరు? అనే ప్రశ్నవంటి ప్రశ్న సంఘంలో ఎన్నడూ రాలేదు, రాదు - అని గురూజీ ఛలోక్తిగా అనేవారు. ''మీ తర్వాత ఎవరు?'' అని పత్రికా ప్రతినిధుల గోష్టిలో ఒక పాత్రికేయుడు ఆయనను అడిగాడు మీరు ఎందుకు కాకూడదు? అని ఆయన సమాధానం చెప్పారు.

కనుకనే - గొప్పకార్యకర్త, సంఘటనా శాస్త్రంలో నిపుణుడు, చక్కని మార్గదర్శకుడు అయిన గురూజీ తనవంటి సహచరులు పలువురిని నిర్మాణం చేసారు. డాక్టర్‌జీ కాలంనాటి యువక కార్యకర్తలు, ప్రౌఢ కార్యకర్తలు పలువురు ఆయన ప్రేమను, ఆదరాన్నీ నిత్యం పొందుతూ ఉండేవారు. పాత కార్యకర్తలు దృఢంగా నిలచి పనిచేస్తున్నారు. కొత్తకార్యకర్తలు వందలాదిగా నిర్మాణం అవుతున్నారు. గురూజీ నుండి ప్రేరణ పొంది, ఉన్నతవిద్య అభ్యసించిన నవ యువకులు ఎందరో ఇల్లూ వాకిలీ వదిలి, సంఘం పనికోసం ఎక్కడకు పంపితే అక్కడకు వెళ్ళారు. ఆయన ప్రేరణ ఫలితంగా కొత్తశాఖలు వేలాదిగా ప్రారంభ మైనాయి. వేలాది కార్యకర్తలు కొత్త కొత్త రంగాలలో ముందంజ వేశారు. వివిధ వయస్సులకు, వివిధ వృత్తులకు, వివిధ వర్గాలకు చెందిన లక్షలాది స్వయం సేవకులు ప్రతినిత్యం శాఖకు వెళ్ళసాగారు. ఆయన దేశమంతటా పర్యటించే వారు. అందరికీ ప్రేరణ ఇస్తుండేవారు. ''రైలు పెట్టె నా ఇల్లు'' అనేవారు ఆయన.

సూర్యోదయం కాగానే దాని ప్రభావం ఆకాశంలో, ప్రకృతిలో, ప్రజా

జీవనంలో సహజంగా కనిపిస్తుంది. ఆకాశం అంతటా ఎరుపురంగు అలముకుంటుంది. పిల్లగాలులు మెల్లమెల్లగా వీస్తూ హాయి నిస్తాయి. పువ్వులు విచ్చుకుంటాయి. ఆ పరిమళాలు దూరదూరాలకు గుబాళిస్తాయి. పక్షులు మధురంగా మంజులంగా కలకలారావాలు చేస్తాయి. ఇంటింటా ప్రజలు నిద్ర మేలుకుంటారు. కొత్త ఉత్తేజంతో తమతమ పనులు ప్రారంభిస్తారు. సూర్యోదయం కాగానే ఇవన్నీ సహజంగా జరిగిపోతాయి. సరిగా ఆ విధంగానే సంఘం పెరగగానే ప్రతి జీవనరంగంలో దాని ప్రభావం కనబడింది.

రాజకీయాలు అనే మాట వినపడగానే అంతా పడమటి దిక్కుకు చూడడం నాటివరకు పరిపాటి అయిపోయింది. నాయకులలో దాదాపు అందరూ రాజకీయాలకు యూరప్ దేశాలనుంచి ప్రేరణ పొందేవారు. కొందరు ఆంగ్లేయులనూ, అమెరికన్‌లనూ అదేపనిగా పొగడేవారు. మనం గణతంత్రాన్ని వారినుండే నేర్చుకోవాలని పదేపదే చెప్పేవారు. కొందరు జర్మన్ నియంతృత్వాన్ని మెచ్చుకుంటే, కొందరు రష్యన్ నియంతృత్వాన్ని మెచ్చుకునేవారు. పలువురు రష్యాకు తమ సర్వస్వాన్నీ అర్పించుకున్నారు. ఐర్లండ్, ఇటలీ వంటి దేశాల నుంచి స్ఫూర్తి పొందేవారు. మరికొందరు స్వామి దయానంద సరస్వతి, స్వామి వివేకానంద, స్వామి రామతీర్థ, యోగి శ్రీ అరవింద, సోదరి నివేదిత, విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్, లోకమాన్య తిలక్ వంటి మహామనీషుల ప్రబోధాల తర్వాత కూడా పెద్ద పెద్ద నాయకులు పరానుకరణ ప్రవీణులు అయినారు. కానీ, సంఘకార్యం ఫలితంగా ఎందరో యువకులలో ఆత్మవిశ్వాసం మేలుకొన్నది. రాజకీయాలలో కూడా భారతీయ ఆదర్శాలను స్థాపించడం సాధ్యమేనని, మానవ కళ్యాణానికి అలా చేయడం అత్యవసరమనీ వారికి నమ్మకం కుదిరింది.

భారతీయ జీవన సిద్ధాంతాలు ఆధారంగా రాజకీయరంగంలో పనిచేయ డానికి డ్వాక్టర్ శ్యామప్రసాద్ ముఖర్జీ ముందుకు వచ్చారు. ఆయన గురూజీని కలుసుకున్నారు. ఇద్దరూ సమాలోచనలు జరిపారు. పండిత దీనదయాళ్‌జీ ఉపాధ్యాయ అనుభవం పొందిన సంఘకార్యకర్త. సంఘ ప్రచారకులు. గురూజీ

ఆదేశం పొంది, దీనదయాళ్‌జీ డ్యాక్టర్ ముఖర్జీతో పాటు రాజకీయ రంగంలో పనిచేయసాగారు.

ఆ విధంగానే, శ్రీ దత్తాజీ డిడోళ్‌కర్ విద్యార్థి రంగంలో పనిచేయసాగారు. శ్రీ దాదాసాహెబ్ ఆప్టే, శ్రీ రాజభావూ డ్వేకర్‌లు విశ్వహిందూ పరిషత్ కార్యభారాన్ని స్వీకరించారు. కార్మికరంగంలో విదేశీ ప్రభావాన్ని తొలగించడానికై శ్రీ దత్తోపంత్ ఠేంగ్డీ నడుంకట్టారు. శ్రీ ఏకనాథ్‌జీ రానడేకు కన్యాకుమారి సమీపాన శ్రీపాదశిలపై ధ్యానంలో కూర్చొని ఉన్న స్వామి వివేకానందుని రూపం పదేపదే కనిపించసాగింది. వనవాసి సోదరుల వికాసానికై పని ప్రారంభించాలనే ప్రేరణ శ్రీ బాబాసాహెబ్ దేశపాండేకు లభించింది.

శ్రీ గురూజీ యోజన ఫలితంగా గోహత్యా నిషేధానికై దేశవ్యాప్తంగా జరిగిన ఉద్యమం సఫలమైంది. కుష్ఠురోగుల కోసం సేవాకేంద్రాలు ప్రారంభమైనాయి. చదువుకున్న యువకులు త్యాగభావంతో, సేవాభావంతో ఆ సంస్థలలో పనిచేయసాగారు. కరువు కాటకాలలో, వరదల సమయాలలో బాధితులకు సహాయ కార్యక్రమాలు అమలుజరుగుతూ వచ్చాయి. ఈ కార్యక్రమాలు, పథకాలు అన్నింటికీ పరమపూజనీయ శ్రీ గురూజీ ఒక్కోసారి ప్రత్యక్షంగా, ఒక్కోసారి పరోక్షంగా సలహాలు ఇచ్చేవారు.

శ్రీ దత్తోపంత్ ఠేంగ్డీ కార్మికరంగంలో పనిచేయాలని నిర్ణయమైంది. ఆయన 1950 మార్చి నెలలో ఐ.ఎన్.టి.యు.సి. (ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్)లో చేరారు. ఆయన గురూజీని కలుసుకున్నారు. గురూజీ ఆయనకు ఆశీస్సులు ఇస్తూ, ముఖ్య సూచనలు కొన్ని చేశారు. వాటి సారాంశం ఇది :

1. మీరు ఏ సంస్థలో పనిచేయడానికి వెళుతున్నారో ఆ సంస్థ క్రమశిక్షణను అక్షరాలా పాటించాలి. క్రమశిక్షణకూ, విచక్షణా జ్ఞానానికీ పూర్తి వైరుధ్యం ఏర్పడే పక్షంలో - ఆ సంస్థకు రాజీనామా ఇవ్వాలి. అంతేకాని, క్రమశిక్షణను ఉల్లంఘించకూడదు.

2. మహాత్మాగాంధీ, కార్ల్‌మార్క్స్ ఆర్థిక సిద్ధాంతాలను తులనాత్మకంగా అధ్యయనం చేయాలి.

3. కమ్యూనిస్టుల కార్యపద్ధతిని అర్థం చేసుకోవాలి. వారి కార్మిక సంఘాలను లోతుకుపోయి పరిశీలించాలి.

4. పర్యటనలు జరిపేటప్పుడు కార్మికుల ఇళ్ళలోనే బసచేయాలి.

5. మీ తల్లి మిమ్మల్ని ఎంత గాఢంగా ప్రేమిస్తుందో అంత గాఢంగా మీరు కార్మికులను ప్రేమించాలి.

6. కార్మిక రంగంలో చేసే పని నుంచి రాజకీయ రంగంలోకానీ, మరో రంగంలోకానీ అనుచిత ప్రయోజనం పొందాలనే ఆలోచన సైతం మనసులోకి రానీయకూడదు.

7 సమాజంలో వైమనస్యం తొలగే విధంగా, వర్గతత్వం నశించేవిధంగా, జాతిప్రయోజనాలను కాపాడాలనే భావన మేలుకొనే విధంగా ప్రయత్నం సాగించాలి.

ప్రతి పనినీ, ప్రతి సంఘటననూ, ప్రతి వ్యక్తినీ విశాలమైన దృష్టితో మౌలికమైన దృష్టితో, మానవ కళ్యాణ దృష్టితో చూడడం గురూజీ ప్రత్యేకత. ఆ దృష్టిని స్వయంసేవకులకూ, కార్యకర్తలకూ హిందూ సమాజానికి అలవరచ డానికి ఆయన విశ్వప్రయత్నం చేశారు.

1965లో పాకిస్తాన్‌తో యుద్ధం వచ్చింది. ప్రధానమంత్రి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ప్రత్యేక ఆహ్వానం పంపి గురూజీని ఢిల్లీ పిలిపించారు. ప్రధాని అడిగినదే తడవుగా గురూజీ నిస్సంకోచంగా ఇలా హామీ ఇచ్చారు : ''సంఘ స్వయంసేవకులు పిన్నలూ పెద్దలూ అందరూ దేశ ప్రయోజనాన్ని దృష్టిలో ఉంచుకొని మీరు ఏ పని అప్పగిస్తే దాన్ని నిరపేక్ష భావంతో శ్రద్ధతో నిర్వ హిస్తారు.''

విశ్వహిందూ పరిషత్ అనే లేత మొక్కను గురూజీ తన చేతులతో

పెంచారు ఎంతో మెలకువతో దానిని కాపాడుతూ వచ్చారు. అందుకోసం ఆయన ఎందరో సాధువులను, సంత్‌లను, మఠాధిపతులను కలుసుకున్నారు. ఆయన రకరకాల వ్యక్తులను కలియవలసి వచ్చింది. కొందరు కాషాయ బట్టలు కట్టుకుంటారు కానీ, మనసులో అహంకారం పెంచుకుంటారు. సన్యాసులమని చెప్పుకుంటూ ఉంటారు. అయినా పదవులకోసం, పేరు ప్రఖ్యాతులకోసం, ఆస్తుల కోసం తగాదాలు పడుతూ వుంటారు. ఎందరెందరికో గురూజీ నచ్చ జెప్పారు. త్రోవ చూపారు. విధి నిర్వహణకు ప్రేరణ ఇచ్చారు.

గురూజీ వారికి ఇలా హితవు చెప్పారు ''మీరు మమ్మల్ని పరిమితం చేసుకోకండి. గిరి గీసుకొని కూర్చోకండి. ఏదో ఒక మఠానికో, సంస్థలో మిమ్మల్ని మీరు కట్టివేసుకోకండి. సమాజ పురుషుణ్ణి, విరాట్ పురుషుణ్ణి పూజించండి. దళితులు, ఉపేక్షితులు, పీడితులు, ఆర్తులు అయిన వారిని ఆదుకొనడానికి ముందుకు ఉరకండి. దీనులు, హీనుల కన్నీరు తుడవండి. అంటరానితనాన్ని అంతమొందించండి. మన ధర్మంలో అంటరానితనానికి తావు లేనేలేదు.''

విశ్వహిందూపరిషత్ పని శరవేగంతో పెరగాలనీ, ప్రపంచం అంతటా విస్తరించాలనీ ఆయన కోరిక. అందువల్ల ప్రారంభ దశలో పరిషత్ సమావేశాలు అన్నింటిలో ఆయన పాల్గొన్నారు. 1966లో ప్రయాగలో కుంభమేళా సందర్భంగా విశ్వహిందూ పరిషత్ ఆధ్వర్యంలో ఒక బ్రహ్మాండమైన మహాసభ తలపెట్టారు. అనేక సంప్రదాయాల పెద్దలు మండలేశ్వరులు, మహామండలే శ్వరులు; శంకరాచార్యులు, పీఠాధిపతులు మహాసభలో పాల్గొన్నారు. అంతా పూర్తి సహకారం అందించారు. మనసు విప్పి ధార్మిక చర్చలు జరిపారు. వేయి సంవత్సరాల పూర్వం హర్షవర్ధన చక్రవర్తి అన్ని సంప్రదాయాల పెద్దలతో భారీ ఎత్తున మహాసభ జరిపారు. ఆ మహాసభ తర్వాత శ్రీ గురూజీ ప్రేరణతో విశ్వహిందూపరిషత్ ఈ మహాసభ నిర్వహించింది. మహాసభకోసం గురూజీ శారీరకంగా, మానసికంగా ఎంతో శ్రమించవలసి వచ్చింది. ఆయన పలువురిని

చేతులు జోడించి ప్రార్థించారు. పలువురిపై వాక్ బాణాలు ప్రయోగించారు కూడా. మహాసభ వ్యవస్థ అంతనూ ఎంతో మెలకువగా పర్యవేక్షించారు. ఆమహా సభను జయప్రదం చేయడానికి ఆయన అన్ని పనులూ చేశారు. ఒక్కపనిమాత్రం చేయలేదు. ఆయన కుర్చీలో కూర్చోలేదు. ''కర్మణ్యే వాధికారస్తే మా ఫలేషు కదాచన'' అనే గీతా సందేశాన్ని ఆయన తన ఆచరణ ద్వారా ప్రపంచానికి అందించారు.

# 26. అద్భుతం ఆ స్మరణశక్తి

ఒకసారి ఎవరితో ఐనా పరిచయం అయితే, ఆ వ్యక్తిని ఎప్పుడూ మరచిపోరు గురూజీ. ఎన్నో సంవత్సరాల తర్వాత కలుసుకున్నా, ఆయన ఆ వ్యక్తిని పేరు పెట్టి పిలిచేవారు. ఇలాంటి తమ స్వంత అనుభవాన్ని వేలాది వ్యక్తులు వర్ణించి ఉన్నారు.

ఒక కార్యకర్త ఇంటిలో గురూజీ రెండు రోజులు బసచేశారు. ఇంటిలోని వ్యక్తులను కుశల ప్రశ్నలు వేయడం, పిల్లలతో పరిచయం చేసుకోవడం ఆయన సహజంగా చేసేపనులే. ఆ ఇంటిలోనూ అదే జరిగింది. మూడు సంవత్సరాల తర్వాత గురూజీ ఆ త్రోవన రైలులో వెళుతున్నారు. అక్కడి కార్యకర్తలు పలువురు ఆయనను కలుసుకోవడానికి స్టేషన్ వెళ్లారు. ఆ కార్యకర్తను చూసి చూడగానే , ''మరి శాంతూను తీసుకురాలేదేమిటి?'' అని అడిగారు.

ఆ కార్యకర్త అలా చూస్తూ ఉండిపోయాడు బొమ్మలా. ఆయన ఆలోచిస్తున్నాడు. .....మూడు సంవత్సరాలు గడిచాయి. ఆ తర్వాత గురూజీ ఎన్ని ఊళ్ళకు వెళ్లి ఉంటారో. ఎన్ని ఇళ్ళలో బసచేసి ఉంటారో, ఎన్నో వేల మందిని కలుసుకుని ఉంటారు. ఎన్నో వేలమంది స్వయంసేవకులను పరిచయం చేసుకొని వుంటారు. మా పిల్లవాడు పెద్ద కార్యకర్త కాడుకదా. వాడికి అప్పుడు అసలు మాటలైనా వచ్చోరావో, అయినా గురూజీకి వాడి పేరు ఎలా గుర్తుంది..... ఈ ఆలోచనలతో ఆ కార్యకర్త తలమునకలైనారు.

ఇలాంటి ఉదాహరణలు వేలకు వేలు చూపవచ్చు.

ఒక ఊరిలో సమావేశం జరిగింది. అంతా పరిచయం చేసుకున్నారు. ఒక యువ స్వయంసేవక్ లేచి నిలబడ్డాడు. పరిచయం చేశాడు. అతడి లాల్చీకి గుండీలు లేవు. గురూజీ అది గమనించారు. ''ఏమిటి సంగతి? లాల్చీకి గుండీలు ఎందుకు పెట్టుకోలేదు?'' అని అడిగారు. స్వయంగా సంపాదించి, బంగారు గుండీలు తయారుచేయించుకున్నప్పుడే లాల్చీకి గుండీలు పెట్టుకోవాలని నిర్ణయించుకున్నాను - అని ఆ స్వయంసేవక్ సమాధానం చెప్పాడు.

ఐదు సంవత్సరాల తర్వాత మరో ఊళ్ళో జరిగిన సమావేశంలో ఆ స్వయంసేవక్ పాల్గొన్నాడు. పరిచయం చేస్తూ అతను తన పేరు చెప్పీ చెప్పగానే - '' బంగారపు గుండీలు తయారు చేయించుకున్నట్లు కనబడుతోందే!'' అన్నారు గురూజీ.

''మళయాళ మనోరమ'' పత్రిక సంపాదకుడు కె.పి.కె. పిశార్డీ 1948 ఫిబ్రవరిలో ఢిల్లీ వెళ్లారు. గురూజీ అప్పుడు సివనీజైలులో ఉన్నారు. పిశార్డజీకి గురూజీతో అంతకుముందు పరిచయం లేదు. ఆయన సంఘ స్వయంసేవక్ కాదు. ఒక పాత్రికేయుడుగా గురూజీని కలుసుకోవాలని ఆయన అనుకున్నారు. అందుకోసం సీవనీ వెళ్ళారు. కానీ జైలు అధికారులు ఆయనకు అనుమతి ఇవ్వలేదు ''నేను కలుసుకోవడానికి వచ్చినట్లు ఆయనతో చెప్పండి'' - అని పిశార్టీజీ జైలు అధికారులకు విజ్ఞప్తి చేశారు. ఆ ప్రకారం పిశార్డీ అనే వ్యక్తి ఆయనను కలుసుకోవడానికి వచ్చినట్లు జైలు ప్రధాన అధికారి గురూజీకి తెలియజేశారు.

1965లో గురూజీ పాల్ఘాట్ వెళ్లారు. పిశార్డీగారు గురూజీని కలుసుకోవడానికి అక్కడికి వెళ్లారు. ఆయన తన పేరు చెప్పగానే గురూజీ, ''సివనీ వచ్చి, నన్ను కలుసుకోవడానికి విఫల ప్రయత్నం చేసిన పిశార్డీగారు మీరు కాదుకదా'' అని అడిగారు.

గురూజీ స్మరణశక్తిని చూసి పిశార్డీగారు ఆశ్చర్యచకితులు అయినారు.

ఒకసారి ఒక స్వయంసేవక్ అడగనే అడిగాడు - గురూజీ, ఇందరు స్వయంసేవకుల పేర్లు మీకు ఎలా గుర్తుంటాయి-అని.

గురూజీ ఇలా సమాధానం చెప్పారు : ''నీది కిరాణా వ్యాపారం కదా. మీ కొట్లో వందలాదిగా సరకులు ఉంటాయి. ఒక్కో సరుకుకు ఒక్కో ధర. ఆధరలన్నీ నీకు ఎలా గుర్తుంటాయి? నీవు వాటిని బట్టీ పట్టవు. మాటిమాటికీ పుస్తకం చూడవు. ఎందుకు గుర్తుంటుందంటే - కొట్టు నీకు జీవనాధారం. నీ సర్వస్వం. నీ దృష్టి అంతా దానిమీదే నిలిచి ఉంటుంది. నా విషయమూ అంతే. సంఘం, సంఘ స్వయంసేవకులూ నా సర్వస్వం. వారిని నేను ఎలా మరువగలను?''

# 27. బహుముఖ పాండితీ ప్రతిభ

గురూజీ బుద్ధివైభవం సర్వతోముఖమైనది. అనేక శాస్త్రాలలో, కళలలో, ఆయనకు అపారమైన జ్ఞానం ఉన్నది. కుశాగ్రమైన బుద్ధితో ఆయన అన్ని విషయాలనూ తరచి చూసేవారు. వాటి మర్మాన్ని గ్రహించేవారు.

ఆయన విశ్వవిద్యాలయంలోనే జీవశాస్త్రమును ప్రత్యేకంగా అధ్యయనం చేశారు. విజ్ఞానశాస్త్రంలోని ఇతర శాఖలలో కూడా ఆయనకు విశేషమైన పాండిత్యం ఉంది. ఉపనిషత్తులు, భాగవద్గీత వంటి గ్రంథాలు ఆయన రోజూ చదువుతూ వుండేవారు. ఎంత పెద్ద గ్రంథాన్ని అయినా అలా పేజీలు తిరగవేసేవారు. ఒకటి రెండు గంటలలో దాని సారాన్ని గ్రహించేవారు.

ఒకసారి బొంబాయిలో ఒక ప్రఖ్యాత ఆర్థికశాస్త్రవేత్త గురూజీని కలుసుకున్నారు. ఆర్థిక శాస్త్రమునకు సంబంధించిన నిగూఢ విషయాలపై ఆయనతో రెండు గంటలపాటు చర్చ జరిపారు. ఆ తర్వాత ఆయన తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తం చేశారు. ''సంఘంతో నాకు ప్రత్యేకంగా పరిచయంలేదు. అభిప్రాయ భేదం ఉన్నా ఉండవచ్చు. అయితే ఒకటిమాత్రం ఖచ్చితంగా

చెప్పగలను. గురూజీ ఆర్థిక శాస్త్రమును మధించారు.''

గురూజీకి వైద్యశాస్త్రంలోనూ మంచి ప్రవేశం ఉంది. గృహవైద్యం చిట్కాలు ఆయనకు తెలుసు. ''నిద్ర నన్ను వేధిస్తోంది'' అని ఒకరు ఆయనతో చెప్పారు. గురూజీ ఆ వ్యక్తికి హోమియోపతీ మందు సూచించారు.రోజూ దీర్ఘశ్వాస జరపమని సలహా ఇచ్చారు.

ఒకసారి బెంగుళూరు శిక్షావర్గలో ఆర్కెస్ట్రా కార్యక్రమం ఏర్పాటు చేశారు. గురూజీ అప్పుడు అక్కడ ఉన్నారు. కార్యక్రమం తర్వాత ఆ వాద్యాలు వాయించినవారు అందరినీ గురూజీకి పరిచయం చేశారు. అప్పుడు ఆయన ఆయా వాద్యాలలోని ప్రత్యేకతలను వివరించారు. ''మేము ఈ వాద్యాలను సంవత్సరాల తరబడి సాధన చేశాము. అయినా మేము ఈ రోజున ఎన్నో కొత్త విషయాలు తెలుసుకున్నాము'' - అని ఆ వ్యాఖ్య విన్న ఆర్కెస్ట్రాలోని ప్రసిద్ధ విద్వాంసులు చెప్పారు.

నిర్మాణంలో ఉన్న భవనాన్ని చూసి గురూజీ ఇచ్చే సలహాలు విని అనుభవాన్ని కాచి వడపోసిన ఇంజనీర్లు సైతం ఆశ్చర్యచకితులు అయ్యేవారు. ఆ సలహాలు అంత శాస్త్రీయంగా ఉండేవి.

# 28. సమయపాలన

ఒకసారి ఢిల్లీలో ఒక పెద్ద సంస్థ మహాసభలు భారీ ఎత్తున జరిగాయి. ఆ సంస్థకు పుష్కలంగా ధనం ఉంది. సమృద్ధిగా వనరులు ఉన్నాయి. కానీ, అనుశాసనం అన్నది లేదు. ఏ కార్యక్రమమూ వేళకు జరగలేదు. గంటల తరబడి ఆలస్యంగా రావడం నాయకులకు అదో గొప్ప.

మూడు రోజుల తర్వాత ఆ సంస్థలోనే సంఘ ఉత్సవం జరిగింది. వేలాది స్వయంసేవకులు వేలాది పౌరులు ఉత్సవంలో పాల్గొన్నారు. గురూజీకి ఆ రోజంతా ఊపిరి సలపని కార్యక్రమాలు ఏర్పాటు చేశారు. సుదీర్ఘమైన పర్యటన తర్వాత ఆయన ఢిల్లీ వచ్చారు అయినా, ఆయన సరిగా నిర్ణీత సమయానికి ఉత్సవ స్థలానికి వచ్చారు. ఒకసెకను ఆలస్యంకాలేదు. ఒక్క సెకను

ముందుగా రాలేదు. ఏ పని అయినా నిర్ణీత సమయంలో చేయాలని ఆయన నొక్కి చెప్పేవారు.

ఒకసారి ఆయన పూనా వెళ్లారు. ఆయన ఆ సాయంత్రం ఒక శాఖకు వెళ్లాలని నిర్ణయమైంది. 5.45కు ఆయన బసచేసిన గృహం వద్దకు కారు వస్తుందని ఆయనతో చెప్పారు. 5 50 వరకు ఆయన కారు కోసం ఎదురు చూశారు. కారు రాకపోయేసరికి, సైకిల్ ఎక్కి శాఖకు వెళ్లారు గురూజీ సైకిల్‌మీద రావడం చూసి అక్కడి సంఘ అధికారులు విస్తుపోయారు. గురూజీ తాపీగా ఇలా అన్నారు. కారు ఒక యంత్రంకదా అది చెడిపోవచ్చు. దాన్ని వాడుకోవడం మంచిదే. కానీ, దానిమీద ఆధారపడి ఆలస్యం చేయడం మంచిది కాదు. నేను ఏ వాహనం మీద వచ్చాను అన్నది ముఖ్యంకాదు. నిర్ణీత సమయానికి రావడం ముఖ్యం.''

ఒకసారి పంజాబ్‌లో ఆయన పర్యటన జరుగుతోంది. అక్కడ చాలా రోజులుగా భారీ వర్షాలు కురుస్తున్నాయి. నదులకు వరదలు వచ్చాయి. కాలువలన్నీ పొంగి పొరలుతున్నాయి. గురూజీ జలంధర్ నుంచి లూధియానా వెళ్లాలి. ఆయన కారులో చేహెడూవరకు వచ్చారు. ఆ పైన వంతెన కూలి పోయింది. రైల్వేలైనుకు ప్రమాదం ఏర్పడింది. కనుక రైళ్ళ రాకపోకలు ఆగిపోయాయి. రైలు పట్టాలక్రింద ఉండే స్లీపర్లు వరదలలో కొట్టుకు పోయాయి రైలు పట్టాలు మాత్రం వేలాడుతున్నాయి. గురూజీ వెంట ఉన్న కార్యకర్తలు ఏమి చేయాలా అని ఆలోచనలో పడ్డారు. ఈలోగా గురూజీ ఆ రైలు పట్టాలమీద నడుస్తూ వెళ్లిపోతున్నారు. (వేలాడుతున్న రైలు పట్టాలమీద తన శరీరాన్ని ''బేలెన్స్''చేస్తూ వంతెన దాటుతున్నారు. క్రింద వరదనీరు పరవళ్ళు త్రొక్కుతోంది. అయినా ఆయన ఎక్కడా తొట్రుపడలేదు. ఎక్కడా ఆగలేదు. అలా తరగని వేగంతో ఆయన నడుస్తూనే వున్నారు. దైవ కృపవల్ల అందరూ క్షేమంగా ఆవలి ఒడ్డుకు చేరుకున్నారు. అక్కడ ఒక కారు దొరికింది. కానీ, ఫగ్వాడాలో కారు దిగిపోవలసి వచ్చింది. ఎందుకంటే రోడ్డు అంతా

జలమయం అయిపోయింది. రాకపోకలు స్తంభించి పోయాయి. రైల్వే స్టేషన్‌లో ఆ సమయంలో ప్రయాణికుల రైలు ఏదీ లేదు. ఒక గూడ్సు బండిమాత్రం ఉంది. వారిని తీసుకువెళ్ళడానికి డ్రైవర్ ఒప్పుకున్నాడు. గురూజీ బొగ్గు వ్యాగన్‌మీద వెళ్లి కూర్చున్నారు. అలా ఇరవైమైళ్ళు ప్రయాణం చేశారు. రైలు దిగేసరికి అందరి ముఖాలూ, బట్టలూ బొగ్గుమసి పట్టి నల్లగా తయారైనాయి. కూలిన వంతెనకు ఆవలి వైపునే సామాను వదిలివేశారు. గురూజీ నివాస స్థలానికి వెళ్లారు. కాళ్ళు, మొగం కడుక్కొని, మరొకరి పంచె, లాల్చీ వేసుకొని ఖచ్చితంగా వేళకు సంఘస్థాన్‌కు చేరారు.

# 29. భగవంతునిదే భారం

గురూజీ దేశమంతటా నిత్యం పర్యటిస్తూ ఉంటారు. వివిధ ప్రాంతాలలో, వివిధ గ్రామాలలో సంఘానికి బద్ధవిరోధులైన వ్యక్తులను ఎదుర్కొనవలసి వచ్చేది. ఒక్కోసారి ఆయనకు వ్యతిరేకంగా ప్రదర్శనలు జరిగేవి. ఆయనపై రాళ్లు రువ్వడమూ జరిగేది.

అయినా, గురూజీ ఎన్నడూ అడుగు వెనకకు వేయలేదు. ఎన్నడూ మృత్యువును లెక్కచేయలేదు. ''ముగ్గురు నలుగురు అంగరక్షకులు మీకు తప్పకుండా ఉండవలసిందే'' అని పలువురు ఆయనకు సలహా ఇచ్చారు. ఆయన నవ్వుతూ ఇలా జవాబు చెప్పేవారు. ''నాకు ఒకే ఒక అంగరక్షకుడున్నాడు. ఎన్ని వేలమందిని అయినా తరిమికొట్టగల సామర్థ్యం అతనికి ఉంది. పరమేశ్వరుణ్ణే మించిన బలం ఎవరికి ఉంటుంది? అతడే నా రక్షకుడు. జాకో రాఖే సాఇయా మార్ సకై నహి కోయ్.

ఒకసారి ఒక విదేశీ ప్రముఖుడు గురూజీని కలుసుకోవడానికి వచ్చారు. ఆ రోజు సాయంత్రం సంఘ ఉత్సవం జరుగుతున్నది. ఉత్సవాన్ని చూడటానికి ఆయన వెళ్ళారు. అక్కడి వ్యవస్థ చూసి ఆయన ఎంతో ఆందోళన చెందారు. ధ్వజం సమీపాన, సభావేదిక సమీపాన కొద్దిమంది స్వయంసేవకులు లాఠీలు

పుచ్చుకొని నిలబడ్డారు. ''ఆయన ఇంత పెద్ద నాయకులు కదా ఆయన రక్షణ కోసం ఏర్పాటు ఏదీ లేదేమి? ఎవరైనా తుపాకిగుండు వదిలితే ఏమవుతుంది? - అని ఆయన పదేపదే ప్రశ్నించసాగారు.

ఉత్సవం చూసి, గురూజీ ప్రసంగం విని ఆయన ఎంతగానో ప్రభావితులు అయినా, ఆయన ఇక ఉండబట్టలేకపోయారు. గురూజీ బసచేసిన గృహానికి వెళ్లారు. గురూజీని కలుసుకుని, ''మీరు మీ రక్షణ కోసం ఎలాంటి ఏర్పాటు చేశారు? ప్రపంచంలో హత్యలు రోజు రోజుకూ పెరిగిపోతున్నాయి. కనుక మీరు మీ రక్షణకు తగు ఏర్పాటు చేసుకోవాలి'' అని సూచించారు.

గురూజీ ఎప్పటివలెనే గలగలా నవ్వారు. ''నేను అంత గొప్ప వ్యక్తిని కాను'' అని సమాధానం చెప్పారు.

''గొప్ప వ్యక్తిని కానని మీరు అనుకోవచ్చు కానీ, ప్రజలు అలా అనుకోవడం లేదు. వ్యతిరేకులూ అలా అనుకోవడంలేదు. మీ వ్యతిరేకులు హత్యాకారులూ కావచ్చు'' - అని ఆ ప్రముఖుడు వివరించారు.

''చూడండి. అంతా ఆ పరమేశ్వరుని సంకల్పం వల్లనే జరుగుతుందని నమ్మండి. ఇతడు జీవించింది చాలు, ఇతనివల్ల జరిపించదలచిన పని జరిగింది - అని పరమేశ్వరుడు అనుకుంటే, ఆయన ఆ వ్యక్తిని తన వద్దకు పిలిపిస్తాడు. చూడండి, నిన్ననే కెన్నెడీ హత్య జరిగింది. ఆయన రక్షణకు భారీ ఏర్పాట్లు జరిగాయి. కట్టుదిట్టమైన ఏర్పాట్లు జరిగాయి. అయినా ఆయన హత్య జరిగింది. సాధనాలకన్నా, మనిషి చేసే ఏర్పాట్లకన్నా పరమేశ్వరుని సంకల్పం గొప్పదని దాని అర్థం'' అని గురూజీ ఆ విదేశీ ప్రముఖునికి తెలియజెప్పారు.

# ౩౦. నలభైవేల లేఖలు

సంఘ జీవితంలో, సంఘటనలో ఎన్నో అంతర్భాగాలు ఉన్నాయి. వ్యక్తిగత సంబంధాలను, స్నేహ సంబంధాలను పెంపొందించడం ఒక ప్రముఖ

భాగం. గురూజీ ఆ సంబంధాలను ఎంతో శ్రద్ధగా పోషించేవారు. ఆయన కేవలం సర్‌సంఘచాలక్ కారు. వేలాది వ్యక్తులకు ఆయన మిత్రుడు, ఆప్తుడు. పెద్ద దిక్కు. తండ్రి. సంరక్షకుడు. మార్గదర్శకుడు.

ఆయన తలుపులు అందరికీ తెరచే ఉంటాయి. పసివాడు మొదలు వృద్ధుని వరకు అందరూ ఆయనను కలుసుకునేవారు. మనసు విప్పి తమ కష్టాలు ఆయనకు వినిపించేవారు. ఆయన ప్రశాంతంగా ఆ గాథలన్నీ వినేవారు. చిక్కుముడులు విప్పేవారు.

ఇంత విస్తృత స్థాయిలో వ్యక్తిగత సంబంధాలను నిలిపి ఉంచే ఇంత పెద్ద నాయకుడు ప్రపంచం అంతటిలో మరొకరు లేరేమో. విద్యార్థులు ఆయనను తమ చదువు సంగతి అడుగుతారు. పెద్దలూ, వృద్ధులూ తమ కొడుకులూ కూతుళ్ళ పెళ్ళిళ్ళ విషయంలో ఆయనను సలహా అడుగుతారు. వివిధ రాజకీయ పక్షాల నాయకులు ఆయనను కలుసుకొని ఆయన అభిప్రాయం తెలుసుకుంటారు. గాయకులు, వాద్య నిపుణులు, నాటక రచయితలు, నటులు ఆయన ఎదుట తమతమ కళలు ప్రదర్శించి అభిప్రాయం అడుగుతారు. కొందరు యోగ సాధనలో ఆయన సహాయం కోరతారు. కొందరు వైద్యం కోసం వస్తారు. అందరినీ ఆయన ఎంతో ఆత్మీయతతో కలుసు కుంటారు.

ఆయన గుర్తుంచుకొని అందరికీ ఉత్తరాలు వ్రాసేవారు. వివాహ సమయాలలో శుభాకాంక్షలు పంపేవారు. ఎవరైనా చనిపోతే, వారి కుటుంబం లోని వ్యక్తులను కలుసుకొని ఓదార్చేవారు. సంఘకార్యకర్తలకు ఉత్తరాలు వ్రాసి, వారిని ప్రోత్సహించేవారు. వారికి వెలుగు చూపేవారు. ఆయన రోజూ 9-10 ఉత్తరాలు తప్పక వ్రాసేవారు. ఉత్తరాలు స్వయంగా వ్రాసేవారు. ఎంతో వేగంగా వ్రాసేవారు. ఈవిధంగా, 33 సంవత్సరాలలో ఆయన నలభైల ఉత్తరాలు తప్పక వ్రాసి వుంటారు. ఇన్ని ఉత్తరాలు వ్రాసినవారు ప్రపంచంలో అరుదుగానే వుంటారు.

# 31. నీలినీడ

1969 ఆగస్టు నెలలో జరిగిన సంఘటన. ఒక సన్యాసి గురూజీని కలుసుకోవడానికి వచ్చారు. ఆయన గురూజీకి చిరకాల మిత్రుడు. ఎన్నో సంవత్సరాల తర్వాత ఇద్దరూ కలుసుకున్నారు. చూసీ చూడగానే ఇద్దరికీ అపార మైన ఆనందం కలిగింది. ఇద్దరూ గాఢంగా కౌగిలించుకున్నారు. సుఖం కట్టలు త్రెంచుకునే క్షణాలలోనే దుఃఖ బీజాలు పడతాయంటారు పెద్దలు. అప్పుడు అదే జరిగిఉండాలి. గురూజీ బనీను జేబులో పెన్ను ఉంది. ఆ ఆలింగనంలో పెన్ను గుండెకు గుచ్చుకుంది. కొద్దిగా నెప్పి పెట్టింది. ఆయన మిత్రునితో కబుర్లు చెప్పారు. సన్యాసి వెళ్ళిపోయారు. అయినా నొప్పి నిలిచిపోయింది. అక్కడ ఒక చిన్న బొడిపి కట్టినట్లు అనిపించింది. డాక్టర్లను పిలిచారు. వైద్యులూ వచ్చారు. రకరకాల మందులు వాడారు. అయినా నొప్పి అలాగే ఉంది. అయితే, పర్యటన, సమావేశాలు, ఉపన్యాసాలు, బౌద్ధిక్ వర్గలవంటి కార్య క్రమాలు యధాప్రకారం జరుగుతూనే ఉన్నాయి.

ప్రతి సంవత్సరం జరుగుతున్నట్లే సంఘశిక్షావర్గల సందర్భంగా గురూజీ పర్యటన ప్రారంభమైంది. అందుకోసం ఆయన పూనా వెళ్లినప్పుడు డాక్టర్ నామ్ జోషీజీ ఆయనను పరీక్ష చేశారు. ''ఈ నెప్పిని అశ్రద్ధ చేయకూడదు. మీరు బొంబాయి వెళ్ళి ఆధునిక సాధనాలతో అన్నిరకాల పరీక్షలూ చేయించు కోవాలి'' అని సలహా ఇచ్చారు. బొంబాయిలో డాక్టర్ శ్రీఖండే, డాక్టర్ ఫడ్కే ఆయన శరీరాన్ని పూర్తిగా పరీక్ష చేశారు. అది కేన్సరు వ్యాధి అని వారికి అనుమానం కలిగింది. కేన్సరు నిపుణుడు డాక్టర్ ప్రఫుల్లజీని పిలిపించారు. దురదృష్టవశాత్తు వారి అనుమానం నిజమైంది. తక్షణమే శస్త్ర చికిత్స జరిపిం చాలి. ఏమాత్రం ఆలస్యం చేయకూడదు'' అని డాక్టర్ ప్రఫుల్లజీ సలహా ఇచ్చారు. ప్రముఖ కార్యకర్తల గుండెలలో రాయిపడింది. సమాలోచనలు జరి గాయి. కానీ, గురూజీ తన నిర్ణయాన్ని ఇలాస్పష్టంగా ప్రకటించారు. ''ఇప్పుడు

కాదు, సంఘశిక్షావర్గల పర్యటన కార్యక్రమం పూర్తయిన తర్వాత శస్త్ర చికిత్స జరుగుతుంది ''

కేన్సరు పేరు వినగానే పలువురు గాబరా పడతారు. కానీ, గురూజీ ప్రశాంతంగా ఉన్నారు. తలమీద కత్తి వ్రేలాడుతోంది. అయినా ఆయన యధా ప్రకారం శిక్షావర్గ కార్యక్రమాలు నిర్వహిస్తూనే వున్నారు. బౌద్ధికవర్గ సమావే శాలు, హాస్య వినోదాలు అన్నీ ఎప్పటివలె జరిగిపోతున్నాయి.

పర్యటన పూర్తయింది. గురూజీ బొంబాయికి వెళ్లారు ఆయన ఛాతీ మీద శస్త్రచికిత్స జరిగింది. కాన్సరు వ్యాపించిన భాగాలు అన్నింటినీ తొలగించారు. శస్త్రచికిత్స మూడు గంటలపాటు జరిగింది. గురూజీ 26 రోజులపాటు ఆస్పత్రిలో ఉండవలసి వచ్చింది. మనోబలం కారణంగా, ఆనందమయ స్వభావం కారణంగా ఆయన చాలా త్వరగా కోలుకున్నారు. క్రమక్రమంగా ఆయన పర్యటస కూడా ప్రారంభమైంది. పలుమారులు జ్వరం వస్తుండేది. పలుమారులు స్పృహతప్పిపోయేది. అయినా ఆయనద్వారా సంఘకార్యం నిరాటంకంగా సాగుతూ వచ్చింది. ఆ రోజుల్లో కొందరు ప్రముఖ కార్యకర్తలు తనువులు చాలించారు. మరెన్నో దెబ్బలు తగిలాయి. అయినా ఆయన తపో యజ్ఞం సాగుతూనే వుంది నిరాఘాటంగా.

''గురూజీ ఇకమీదట మీరు మరింతగా విశ్రాంతి తీసుకోవాలి'' అని ఆయనను కలుసుకోవడానికి వచ్చే వ్యక్తులు సలహా ఇచ్చేవారు. ఆయన తక్షణ ఇలా సమాధానం చెప్పేవారు. ''ఇప్పుడు విశ్రాంతి తీసుకుంటే ఎలా? ఇప్పు డయితే కొద్ది సమయంలో హెచ్చుపని చేయవలసి వుంది. పరీక్ష పేపరు వ్రాస్తున్న విద్యార్థి చివరి అరగంటలో తన వ్రాత వేగం పెంచుతాడు. నేను కూడా అలాగే చేయాలి.''

ఒక్కొసారి ఆయన మరో జవాబు చెప్పేవారు. ''విశ్రాంతి అంటూ తీసుకోవలసి వస్తే కొద్దిగా ఎందుకు తీసుకోవాలి? శాశ్వత విశ్రాంతి ఎందుకు తీసుకోకూడదు?''

సంఘ చక్రం సాగిపోతోంది. పర్యటన, ఉత్తరాలు వ్రాయడం, వ్యక్తిగత సంపర్కం, బౌద్ధిక్ వర్గ, సమావేశాలు - అన్నీ యథాప్రకారం సాగిపోతున్నాయి.

ఎవరైనా ఓషధాలను గురించీ, పథ్య పానాలను గురించీ ప్రస్తావిస్తే - ''శరీరం కొంత ఉపయోగపడినంతవరకే దాన్ని గురించి పట్టించుకోవాలి. పనికిరానప్పుడు దానికి చాకిరీ చేయడం అంటే శక్తినీ, సమయాన్నీ వృథా చేయడమే. ఈ శరీరం చివరికి నశించిపోయేదేకదా'' అని జవాబిచ్చేవారు.

ఎవరైనా ఎంతో ఆందోళనతో తన ఆరోగ్యం గురించి మాట్లాడుతూ ఉంటే ఆయన, ''నాకు ఎలాంటి బాధా లేదు. చూడండి.నేను లావవుతున్నాను. ముందు బుజం లావయింది. క్రమక్రమంగా శరీరమంతా లావుగా బలంగా తయారవుతుంది'' అనేవారు. వెంటనే, తనను కలుసుకోవడానికి వచ్చినవారి ఆరోగ్యం గురించి కనుక్కునేవారు.

కాన్సరు వ్యాధి ఎంత భయంకరమైనదో ఎవరైనా వర్ణించడం ప్రారంభిస్తే ''ఆ కాన్సరు సంగతి వదిలెయ్యండి. అది వచ్చింది నన్ను తినేయడానికి. నేనే దానిని తినేశాను. దాని సంగతి ఎత్తకండి. మన సంఘం పని సంగతి చెప్పండి'' - అనేవారు శ్రీ గురూజీ.

# 32. విజయ సందేశం

బొంబాయి సమీపాన ఠాణేలో అతిముఖ్యమైన సంఘ సమావేశం ఒకటి జరిగింది. 1972 అక్టోబరు 29 నుంచి నవంబరు 2 వరకు ఐదురోజులపాటు జరిగింది. దేశంలోని ప్రముఖ కార్యకర్తలంతా సమావేశంలో పాల్గొన్నారు. సుమారు 450 మంది. శ్రీ గురూజీ తన ప్రముఖ సహచరులను సమావేశ పరచారు. వారందరినీ ఒకసారి మనసారా చూసుకోవాలని అనిపించిందేమో ఆయనకు. సంఘానికి సంబంధించిన అనేక మౌలిక అంశాలపై అక్కడ కూలంకషంగా చర్చ జరిగింది. కార్యకర్తలు ఎన్నెన్నో ప్రశ్నలు అడిగారు. గురూజీ ఆ ప్రశ్నలు అన్నింటికీ సమగ్రంగా సమాధానాలు చెప్పారు.

రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘం అఖిలభారతీయ ప్రతినిధి సభ సమావేశం నాగపూర్‌లోని కేంద్ర కార్యాలయంలో 1973 మార్చి 23న జరిగింది. 25వ తేదీ ఉదయం శ్రీ గురూజీ సమారోప ప్రసంగం చేశారు. సుమారు 40 నిమిషాలపాటు ఆయన ప్రసంగించారు. అతి కష్టంమీద మాట్లాడారు. మధ్యలో ఆయాసం వచ్చేది మధ్యలో దగ్గుతెరలు వచ్చేవి. అయినా తన అంతరంగంలోని ఆవేదనను కార్యకర్తలతో పంచుకోవడంలో ఆయనకు ఆనందం కలుగుతోంది. గురూజీ ఆగి ఆగి మాట్లాడుతున్నారు. అంతా ఏకాగ్రమైన మనసుతో వింటున్నారు. పలువురు కన్నీరు కార్చుతున్నారు. ఆ ప్రసంగం ఆయన తుది ప్రసంగంగానే పరిణమించింది. ప్రసంగ సారాంశం ఇలా వుంది.

''ఈ రోజుల్లో అన్ని సంస్థలలోనూ చీలికలు వస్తున్నాయి. జనం తగాదాలు పడుతున్నారు. ఒకరిపై మరొకరికి నమ్మకం ఉండడంలేదు. ఇది విచారించదగ్గ విషయం.''

''తగాదాలను తొలగించడానికీ, చీలిక మనస్తత్వాన్ని అంతమొందించడానికీ మనం నడుంకట్టాం. సంఘటన మన ధ్యేయం. తగాదా పడడం, తగాదాలు కల్పించడం కాదు మన ధ్యేయం. ఈ విషయాన్ని మనం మన హృదయంలో స్థిరంగా నిలుపుకోవాలి. మన సోదరులు అందరికీ తెలియజెప్పాలి. వారి హృదయాలలో ముద్రించాలి. మన దేశంలో రకరకాల మనుషులు ఉన్నారు. వారందరినీ మనం సంఘటితం చేయాలి. ఒకరితో మరొకరు సర్దుకుంటూ ఏవిధంగా ముందుకుపోవాలో నేర్చుకోవాలి. ఇతరులకు నేర్పాలి. మన ధ్యేయం విషయంలో ఎలాంటి భ్రమలూ మన మనసులలో చొరనివ్వకూడదు. మన సహచరుల విషయంలో ఎలాంటి అపోహలూ మన మనసులలో చొరనివ్వకూడదు.

మన స్వయంసేవకులు విద్య, రాజకీయాలు, సామాజిక కార్యాలు, ఆర్థికరంగం, ధర్మం మున్నగు వివిధ క్షేత్రాలలో పనిచేస్తున్నారు. వారు ఆయా

రంగాలలోని నియమ నిబంధనలను అక్షరాలా పాటించాలి. సంఘంలోకి వచ్చి నేర్చుకున్న మంచి విషయాలను మనం ఇతర రంగాలలో, అన్నిరంగాలలో నాటాలి వాటిని కాపాడాలి. పెంపొందించాలి. బయట ఉండే కలుషిత వాతావరణం ప్రభావం మనమీద పడకుండా మనం ప్రత్యేక శ్రద్ధ తీసుకోవాలి

మనం ధ్యేయ ఆరాధకులం కావాలి. మన నిష్ఠ ఏకాగ్రం కావాలి మన శీలం స్వచ్ఛంగా ఉండాలి. రాష్ట్రాన్ని శీలవంతం చేయడమే మన పని. శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి అనుభవం ఒకటి వినిపిస్తాను. విరాళాలు కోరుతూ చేసే విజ్ఞప్తుల క్రింద ఆయన ఎన్నడూ సంతకం పెట్టేవారు కారు. ఎందుకంటే, ఆ వ్యవహారంలో ఆయన చేదు అనుభవాలు అనేకం చవిచూశారు. అయినా, ఈ పని సంఘ స్వయం సేవకులు చేస్తారని నేను ఆయనకు ఉత్తరం వ్రాసేసరికి - ఆయన వెంటనే సంతకం పెట్టారు. ''నాకు వీరి మీద నమ్మకం ఉంది. వీరు విరాళాలు ఏ పనికోసం సేకరిస్తారో ఆ పనికే ఖర్చు చేస్తారు'' - అని ఆయన అప్పుడు అన్నారు. మనం మన ఆచరణ ద్వారా ఇలాంటి నమ్మకాన్ని అందరిలో కలిగించాలి. మన ఆచరణ అంతా దోషరహితంగా , మచ్చలేనిదిగా ఉండాలి.

మన శాఖలు సక్రమంగా నడవాలి. అక్కడ కార్యక్రమాలు క్రమపద్ధతిలో జరగాలి. మనం మన ఆచార పద్ధతిని పాటించాలి. స్వయంసేవకుల స్వభావంలో మాధుర్యం నిండాలి. వారిలోని సుగుణాల రక్షణ, పోషణ జరుగుతూ వుండాలి. శాఖలో ఇదంతా జరుగుతున్నదీ లేనిదీ మనం శ్రద్ధగా పరిశీలిస్తూ వుండాలి. మనకు లభించిన విజయం వెనుక ఉన్న రహస్యం ఇదే. ఇది ఆసరాగానే మనకు అంతటా విజయం లభిస్తుంది.

ప్రతి విషయాన్నీ ప్రభుత్వానికి అప్పగించాలని నేడు ప్రజలు భావిస్తున్నారు. అదే సర్వరోగనివారిణి అని భావిస్తున్నారు. అయితే అదంతా వట్టి భ్రమ. మనల్ని తిరిగి దాస్య శృంఖలాలలో బంధించే మార్గం అది.

''నేడు మన బాధ్యత మరింతగా పెరిగింది. రాష్ట్రం యొక్క ఆత్మను మనం మేలుకొలపాలి. మనం ప్రజలలో సౌశీల్యాన్ని నిర్మాణం చేయాలి.

అందరినీ సంఘటితం చేయాలి. ఇదే మన ధ్యేయం... అయితే ఈపని తేలికకాదు. నేడు దేశంలో విచ్ఛిన్నకర శక్తులు తమ కార్యకలాపాలను విస్తరింపజేస్తున్నాయి. వాటి ప్రయత్నాలను మొదలంటా కూల్చివేయడానికై మనం మన శక్తిని బాగా పెంచుకోవాలి. మనం మన సంఘటనను సర్వవ్యాపిగా చేయవలసి వున్నది. అందుకోసం మనం మన కార్యక్షేత్రాలలో ప్రాణాలను పణంగా ఒడ్డి కృషి చేయవలసి ఉన్నది.

''ఇక ముగిస్తాను. ఈ సభలో మరోమారు మాట్లాడే అవకాశం భగవంతుడు ఇస్తాడో ఇవ్వడో తెలియదు''

# 33. మహాభినిష్క్రమణం

1973లో వేసవికాలం ప్రారంభమైంది. ప్రతి ప్రాంతంలో సంఘ శిక్షావర్గలు నడుస్తున్నాయి. అయితే, ఆ వర్గలకు వెళ్ళడం శ్రీ గురూజీకి సాధ్యపడలేదు. తృతీయవర్ష శిక్షణ నాగపూర్‌లోనే జరుగుతుంది. ఆ శిక్షణ కోసం అన్ని ప్రాంతాలనుంచీ స్వయంసేవకులు నాగపూరు వస్తారు. ఆ స్వయంసేవకులను కలుసుకోవాలనే కోరిక గురూజీకి తీవ్రంగా ఉంది. కానీ ఆయన శరీరం అందుకు అనువుగా లేదు. అందువల్ల సంఘ అధికారులు మధ్యేమార్గం అనుసరించారు. వివిధ ప్రాంతాల స్వయంసేవకులు వంతుల వారీగా ఆయనను కలుసుకుంటారు. అంతా ఆయన గదిలో వరుసలలో కూర్చుంటారు. ఒక్కొక్క స్వయంసేవకు పరిచయం చేసుకుంటాడు. గురూజీ మూడు నాలుగు నిమిషాలు మాట్లాడతారు. స్వయంసేవకులు తిరిగి వెళతారు. అదీ ఏర్పాటు సమావేశం అరగంటలో పూర్తయ్యేది.

మే 26 వరకు అలా సమావేశాలు జరిగాయి. కానీ, ఆ తర్వాత గురూజీ ఆరోగ్యం మరింతగా క్షీణించింది. ఆయనకు ఊపిరి పీల్చడం కష్టమవుతున్నది. వైద్యులు మందులు ఇస్తూనే వున్నారు. కానీ ఆశించిన ఫలితం లభించడంలేదు.

1973 జూన్ 5 ఉదయం గురూజీ తన ఆంతరంగిక కార్యదర్శి డాక్టర్ ఆబాజీ థత్తేతో ఇలా అన్నారు. ''ఆబా, ఈ రోజున గంట కొడుతోం దనిపిస్తోంది. పిలుపు వస్తుంది. ఇందులో విచారించవలసిందేమీ లేదు. కానీ సంఘ శిక్షావర్గలు జరుగుతున్నాయి. మన కార్యకర్తలు అందరూ పర్యటనలో ఉన్నారు. వారి కార్యక్రమాలకు అంతరాయం కలగకుండా ఉండాలని నా కోరిక.

గురూజీ కొన్ని కొన్ని విషయాలలో ప్రత్యేకమైన శ్రద్ధ చూపుతారు. ఆయన గురుదేవులు అఖండానందజీ ఆయనకు ఒక కమండలము ఇచ్చారు. అది ఆయన ప్రియమైన వస్తువు: దానిని ఎప్పుడూ తన ఎడమవైపున ఉంచేవారు ఆయన. ప్రయాణానికి బయలుదేరినప్పుడు మాత్రం కుడివైపున ఉంచేవారు. ఆ రోజు ఉదయం ఆయన కమండలమును కుడివైపున ఉంచారు. పెద్ద ప్రయా ణానికి ఆయన సిద్ధమైనారు.

డాక్టర్లు ఎందరో వచ్చారు. పరీక్షలు జరిపారు. శరీరం బాగా బలహీనం అయిపోయింది. ఏమాత్రం కదలకూడదు అని సలహా ఇచ్చారు. అది సాధ్య మయ్యే పనికాదు. గురూజీ పడకకుర్చీలో కూర్చున్నారు. నామస్మరణ చేస్తు న్నారు. దైవచింతనలో లీనమైనారు. ఆయన నేత్రాలు అర్ధనిమీలితమై ఉన్నాయి. ఆయన దృష్టి నాసికాగ్రంపై లగ్నమై వుంది.

డాక్టర్లు ఏవో కృత్రిమ ఉపాయాలు సూచించారు. గురూజీ ఎంతో సౌమ్యంగా అవేవీ వద్దన్నారు. ఆయన మధ్యాహ్నం నామమాత్రంగా భోజనం చేశారు. సాయంత్రం కొద్దిగా టీ త్రాగారు. ఆయన మాటిమాటికీ కాళ్ళు కడుక్కుంటున్నారు. చేతులు కడుక్కుంటున్నారు. పుక్కిలిస్తున్నారు. సాయంత్రం 7.10 అయింది. అప్పుడు ప్రార్థన జరుగుతుంది. నాటివరకు ఆయన ఎప్పుడూ ప్రార్థన మానలేదు. ఆయన లేవబోయారు. ''ఈ రోజున మీరు కూర్చునే ప్రార్థన చేయాలి'' అని డాక్టర్ ఆబా అన్నారు. ఆప్రకారం పడక కుర్చీలో కూర్చొని గురూజీ ప్రార్థన చెప్పారు. ఉచ్చారణ చాలా స్పష్టంగా వుంది.

రాత్రి 9.5కు ఆయన ఒక దీర్ఘ శ్వాస పీల్చారు. ఇహలోకయాత్ర

చాలించారు. 33 సంవత్సరాలుగా అగ్నికుండం మండుతోంది. భగభగ మండుతోంది. అది నేడు చల్లబడింది. మహా జీవనయజ్ఞం ముగిసింది. 67 సంవత్సరాలపాటు విచ్చుకుంటూన్న వికసిస్తూన్న సుందర సుగంధ జీవన పుష్పం భరతమాత చరణాలకు అర్పితం అయింది. ''మహామంగలే పుణ్యభూమే త్వదర్థే పతత్వేషకాయో నమస్తే నమస్తే'' అనే స్వయంసేవకుని ఆకాంక్ష సఫలమైంది.

# 34. స్మారకం వద్దు

ఆ దుర్వార్త వాయువేగంతో దూర దూరాలకు చేరింది. ''మన పరమ పూజనీయ శ్రీ గురూజీ పోయారు'' అనే వార్త ప్రాంత ప్రాంతానికీ, గ్రామ గ్రామానికీ అందింది ''మన ద్వితీయ సరసంఘచాలక్ ఇక లేరు'' - అంటూ ఇంటింటా ఆర్తనాదాలు వెలికివచ్చాయి. ''మన మూలాధారం పోయింది'', ''స్వార్థం, పక్షపాతం ఎరుగని దేశ నాయకుడు కనుమరుగైనారు.'', ''అయ్యో! ఆయన అందరికీ మార్గదర్శకులే'' - అంటూ వేదనా స్వరాలు వెలువడ్డాయి

అంతిమ దర్శనం కోసం నాగపూరు స్వయంసేవకులు సంఘ కార్యాలయానికి వస్తున్నారు. ఇతర స్థలాలనుంచీ, ఇతర ప్రాంతాలనుంచీ రైళ్ళనిండా ప్రజలు వస్తున్నారు. కార్లలో వచ్చేవారు కొందరు, విమానాలలో వచ్చేవారు కొందరు. అన్ని పార్టీలవారూ, అన్ని వయస్సులవారూ వస్తున్నారు. 5వ తేదీ అర్థరాత్రి నుంచి 6వతేదీ సాయంత్రం వరకు దర్శనార్థుల వరుసలు అలా పెరుగుతూనే ఉన్నాయి. పువ్వులకూ, పూల మాలలకూ ఎప్పుడూ దూరంగా ఉండే ఆయన శరీరంపై పూలమాలలూ, పువ్వులూ గుట్టలు గుట్టలుగా ఉన్నాయి. ఆయన ఎప్పుడూ ఎవరినీ తనకాళ్ళు తాకనిచ్చేవారు కాదు. ఇప్పుడు పెద్ద పెద్ద వ్యక్తులు ఆయన కాళ్లు పుచ్చుకుని కన్నీరు కార్చుతున్నారు.

6వ తేదీ సాయంత్రం అపూర్వమయిన ఆ అంతిమ యాత్రకు సన్నాహాలు జరిగాయి. మహాయాత్ర ప్రారంభం కావడానికి ముందు శ్రీ గురూజీ

ఇచ్చిన అతికించి ఉన్న కవర్లు చించారు. ఆ కవర్లలో ఉన్న లేఖలను మైక్ ముందు చదివారు. మొదటి ఉత్తరాన్ని మహారాష్ట్ర ప్రాంత సంఘచాలక్ స్వర్గీయ శ్రీబాబారావ్ భిడేజీ చదివారు.

''. ... ఇతర ప్రాంత సంఘచాలక్‌లతో నేను ఈ విషయం చర్చించాను. మన ప్రముఖ కార్యకర్తలతో సమాలోచన జరిపాను. ఆ సంప్రదింపుల సారాంశంగా రూపొందిన నిర్ణయాన్ని నేను ప్రకటిస్తున్నాను...... నాతదనంతరం సరసంఘచాలక్ బాధ్యతను శ్రీయుత మధుకర దత్తాత్రేయ (బాలాసాహెబ్) దేవరస్ నిర్వహిస్తారు. మన కార్యం ధ్యేయనిష్ఠం. వ్యక్తినిష్ఠం కాదు. అందువల్ల స్వయంసేవకులు అందరూ పరమపూజనీయ సరసంఘ చాలక్‌జీ నాయకత్వంలో సంఘకార్యం నిర్వహించాలి. అందుకోసమే మనో వాక్ కాయములతో క్రియాశీలురం కావాలి.''

మిగిలిన ఉత్తరాలు రెంటినీ పరమపూజనీయ శ్రీ బాలాసాహెబ్ దేవరస్‌జీ చదివి వినిపించారు. రెండవ ఉత్తరంలో ఇలా వుంది.

''.........మన కార్యంలో రాష్ట్ర పూజ ఉంది. ధ్యేయపూజ ఉంది. వ్యక్తిపూజ లేదు.. .నాకు ఎలాంటి స్మారకమూ నిర్మించవద్దు. వ్యక్తి యొక్క గొప్పతనాన్ని పెంచవద్దు. నేను బ్రహ్మకపాలంలో ఆత్మశ్రాద్ధం చేసుకున్నాను. అందువల్ల మతపరంగా కూడా కర్మలు జరపడం అనవసరం.''

మూడవ ఉత్తరం ఎద లోతులను తాకే ఉత్తరం. ఆ లేఖలో ఇలా ఉంది.

''........పరమపూజనీయ శ్రీ డాక్టర్జీ 1940 జూన్ 21న ఇహలోక లీల చాలించారు. ఆ తర్వాత ఈ మహాకార్యం యొక్క భారం నా తలమీద పడింది. అప్పుడు నాకు అసలు సంఘకార్యంలో అనుభవమే లేదు. అయితే, మన పాత కార్యకర్తలు నన్ను ఆదుకున్నారు...... 33 సంవత్సరాల పాటు నేను ఈ కార్యాన్ని చేస్తూ వచ్చాను. సుదీర్ఘమైన ఈ కాలంలో నా స్వభావంలోని విచిత్ర లక్షణం వల్లకాని, ఇతర దోషాలవల్లకానీ నేను పలువురు కార్యకర్తలకు కష్టం కలిగించి వుండవచ్చు. నన్ను క్షమింపవలసిందిగా వారందరినీ నేను చేతులు

జోడించి ప్రార్థిస్తున్నాను. నా హృదయంలోని భావనలను నేను సంత్ తుకారామ్‌జీ మాటలలో వ్యక్తం చేస్తున్నాను.

అంతిమ హై యహ ప్రార్థనా ! సంత్ జన సునే సభీ
విస్మరణ నహో మేరా ఆపకో ప్రభో కభీ
అధిక ఔర్ క్యా కహూా విదిత సభీ శ్రీ చరణో మె
తుకా కహే చరణ గహూా రఖే కృపాకీ ఛాహమే.

- నా కడసారి ప్రార్థన ఇది. సాధువులు, సంత్‌లు అంతా వినండి. నన్ను ఎప్పుడూ మరువకండి. ఇంకా చెప్పేది ఏముంది? అంతా మీకు తెలిసిందే. మీ కృప అనే గొడుగు నీడను కోరుతూ మీ పాదాలు అంటి తుకారామ్ చెపుతున్న మాట ఇది.

ఆ లేఖలు చదువుతున్నప్పుడు పరమపూజనీయ శ్రీ బాలాసాహెబ్ స్వరం గద్గదం అయింది. వాటిని వింటున్న వేలాది మంది స్వయంసేవకుల కళ్ళనుండి కన్నీటి ధారలు ప్రవహించాయి.

మహాయాత్ర ప్రారంభమైంది. నిర్ణీత సమయానికి రేషిమ్ బాగ్ సంఘస్థాన్ చేరింది. ఆద్య సరసంఘచాలక్ పరమపూజనీయ డాక్టర్ హెడ్గేవార్‌జీ విగ్రహం ఎదుట శ్రీ గురూజీ భౌతిక దేహానికి అగ్ని సంస్కారం జరిగింది. శ్రీ గురూజీ జీవనమూ అగ్నిమయమే. ఆ జీవనం ఒక యజ్ఞం. ఆ జీవన యజ్ఞ జ్వాలలు పైకి ఎగసాయి. ఆకాశాన్ని అందుకున్నాయి. దశదిశలా వ్యాపించాయి. ఎందరెందరో అందులోనుండి తేజోకణాలను పొంది తమ అంతఃకరణాలను వెలిగించుకున్నారు. ఎందరెందరో ఆ అగ్ని శిఖలనుంచి కొత్త వెలుగులు పొందారు. ఎందరెందరో ఆ వెలుగుల వెల్లువలో కొత్త కొత్త బాటలు దర్శించారు.

# జీవన యాత్ర

1906 - ఫిబ్రవరి 19 (మాఘ శు. 11.8.1827, ప్రాతః గం.4.3ని.లకు నాగపూర్‌లో జననం)

1926 - బి.ఎస్.సి. ఉత్తీర్ణత

1928 - యం.యస్.సి. ఉత్తీర్ణత

1929 - మద్రాసులో మత్స్యాలయంలో పరిశోధన

1931 - సంఘ ప్రవేశం

1930-33 - కాశీ విశ్వ విద్యాలయంలో ప్రాధ్యాపకత్వం

1934 - నాగపూర్‌లో తులసీబాగ్ శాఖకు కార్యావాహగా నియామకం.
కొన్ని నెలలు బొంబాయిలో సంఘ కార్యం కొరకు నివాసం.
అకోలా సంఘ శిక్షావర్గకు సర్వాధికారిగా నియామకం

1935 - ఎల్.ఎల్.బి.లో ఉత్తీర్ణత

1936 - దీపావళికి ముందు సారగాచీకి ప్రయాణం -
స్వామి అఖండానందుల వారికి శుశ్రూష

1937 - జనవరి 13, మకర సంక్రమణోత్సవ సందర్భంగా
దీక్షాగ్రహణం
ఫిబ్రవరి 7 అఖండానందుల సిద్ధి
మార్చి చివర నాగపూర్‌కు తిరిగిరాక

1938 - నాగపూర్ సంఘ శిక్షావర్గకు సర్వాధికారిగా నియామకం

1939 - ఫిబ్రవరి చివర సింధీలో కార్యకర్తల సమావేశంలో పాల్గొనడం
22 మార్చి - సంఘ కార్యక్రమానికి కలకత్తాకు పయనం.
సంవత్సరాది నాడు కలకత్తాలో శాఖ ప్రారంభం
నాగపూర్ సంఘ శిక్షావర్గకు సర్వాధికారిగా నియామకం

1940 - 21 జూన్ - పరమపూజనీయ డాక్టర్‌జీ నిధనం
3 జూలై - సరసంఘచాలక్‌గా నియామకం

4 ఆగస్టు - సంఘ గణవేష, సంచలనం (రూట్ మార్చ్)
మొదలగు కార్యక్రమాలపై ప్రభుత్వ నిషేధం.

1942-47 - సంఘ కార్య విస్తరణ

1947 - పంజాబ్ రిలీఫ్ కమిటీ స్థాపన

15 ఆగస్టు - భారత విభజన - స్వరాజ్య ప్రాప్తి

12 సెప్టెంబరు మహాత్మాగాంధీ, సర్దార్ పటేల్‌తో కలయిక

17,18,19 అక్టోబర్‌లో కాశ్మీర్ మహారాజు
శ్రీహరిసింగ్‌తో సంప్రదింపులు

ప్రధానమంత్రి నెహ్రూతో కలయిక

1948 - ఫిబ్రవరి 1 - నాగపూర్‌లో నిర్బంధం

ఫిబ్రవరి 4 - సంఘంపై ప్రభుత్వ నిషేధం

ఫిబ్రవరి 5 - గురూజీ ద్వారా సంఘాన్ని నిలిపివేయడం

ఆగస్టు 6 - విడుదల

అక్టోబరు 17 - ఢిల్లీకి ప్రయాణం

నవంబరు 12 - సర్‌కార్యవాహ గారి సందేశానుసారం సంఘ
కార్య పునరారంభానికి ఆహ్వానం - నిర్బంధం

నవంబరు 9 సంఘ కార్య పునరారంభం - సత్యాగ్రహం

1949 - జనవరి 21 సత్యాగ్రహం నిలుపుదల

జూలై 12 సంఘం మీద నిషేధం తొలగింపు

జూలై 13 విడుదల

ఆగస్టు 21 ఢిల్లీలో అద్భుత స్వాగతం

1950 - ఫిబ్రవరి 8 వస్తుహారా సహాయతా సమితి స్థాపన

ఆగస్టు 11 భూకంప పీడిత సహాయక సంఘం ప్రారంభం

1951 - బీహార్‌లో సంఘం ప్రారంభం. క్షామ బాధిత సహాయ
సమితి స్థాపన

1952 - గోహత్యా నిరోధ సమితి

డిసెంబరు 7 - 2కోట్ల సంతకాలతో గోహత్యా నిరోధ విజ్ఞప్తిని రాష్ట్రపతికి సమర్పణ

1954 - మార్చి - ఏప్రిల్‌లో సింధీలో అఖండ భారత ప్రముఖ ప్రచారకుల 13 రోజుల సమ్మేళనం.

జూలై 21 తండ్రిగారి మరణం

1956 - 51వ జన్మతిథి - దేశ వ్యాప్త ఉత్సవాలు

1962 - మార్చిలో ఇందోర్ అఖిలభారత కార్యకర్తల సమ్మేళనం.

ఏప్రిల్ 5 - నాగపూర్, రేషంబాగ్‌లో స్మృతి మందిర ప్రారంభోత్సవం

ఆగస్టు 12 తల్లి గారి మరణం

వివేకానంద స్మారక సమితి స్థాపన

1964 - కృష్ణాష్టమి పుణ్య పర్వాన బొంబాయిలో సాందీపనీ ఆశ్రమంలో విశ్వహిందూ పరిషత్ సంస్థాపన

1966 - జనవరి 22,23,24 విశ్వహిందూ పరిషత్ ప్రపంచ సమ్మేళనం - ప్రయాగలో

1969 - బ్రహ్మకపాలంలో స్వశ్రాద్ధ విధి

1970 - జూలై 1 కాన్సర్ ఆపరేషన్

అక్టోబరు 29 నుండి 2 నవంబరు వరకు

ఠాణాలో 450 మంది కార్యకర్తల సమావేశం

1972 - ఆగస్టు 20 - దీనదయాళ్ శోధ్ సంస్థాన్ ప్రారంభోత్సవం

1973 - మార్చి 14 తుదిసారి పర్యటన తరువాత నాగపూర్ ఆగమనం

మార్చి 23-24 ప్రతినిధి సభా సమావేశం

''విజయమే విజయం'' - తుది ప్రసంగం

ఏప్రిల్ 2 మూడు ఉత్తరాలు వ్రాసి ఉంచడం

జూన్ 5 రాత్రి గం.9.5 ని.లకు మహాప్రయాణం

జూన్ 6న రేషంబాగ్‌లో అంత్యేష్ఠి సంస్కారం

ఇతిశమ్.